# BHARATANAREEMANULU



**Kavishiromani**
**Prof. R. Vasunandan**

# భారతనారీమణులు



కవిశిరోమణి
ఆచార్య రావికంటి వసునందన్

# భారతనారీమణులు

(పిల్లల కథలు)




కవిశిరోమణి

ఆచార్య రావికంటి వసునందన్

# BHARATHANAREEMANULU (Children Stories)

by *Kavishiromani*
**Prof. Raavikanti Vasunandan**



**Prof. Raavikanti Vasunandan**
Professor of Telugu
Principal Investigator UGC Major Research Project
Dr.B.R. Ambedkar Open University
Road No.46, Jubilee Hills, Hyderabad-33.
Cell: 9849852182

First Edition: **2009**
Cover Design: **M. Ramesh**

Price: **Rs. 30/-**

*For Copies:*
**All Branches of Vishalandhra**

*Printed at:*
**Vipla Computer Services**
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph.: 2765 4003, 2767 6910, 27677078

*Sponsored by*




**Andhra Pradesh Arya Vyshya Mahasabha**
Vyshya Bhavan, Khairatabad, Hyderabad - 500 004



*President*
**Sri Immadishetty Koteshwara Rao**



*General Secretary*
**Sri Udutha Purushotham**



*Add.General Secretary*
**Sri Paladi Manikyaprabhu**



నా అర్ధాంగలక్ష్మి

**శ్రీమతి విజయలక్ష్మికి**

ప్రేమతో...

- వసునందన్

# చరిత్ర పుటలలో...

**డా. ఎం.కె.రాము,** ఎం.ఏ., పిహెచ్.డి.,
రసమయి వ్యవస్థాపక అధ్యక్షులు
విశ్రాంత బాలభవన్ సంచాలకులు (ఆం.ప్ర.ప్రభుత్వం)

చరిత్ర పుటలను తిరగేస్తే ఎందరెందరో మహానుభావులు తమతమ ప్రతిభా సామర్థ్యాలతో తామున్న కాలాన్నే ప్రభావితం చేసి భావితరాలకు స్ఫూర్తి ప్రదాతలై, మార్గ నిర్దేశకులై నిలిచారు. వారందరికీ మనం నిండు మనసుతో నీరాజనాలర్పిద్దాము.

అటువంటి వారిలో పురుషులను గురించి చాలామంది రచించారు. కానీ, మహిళల చరిత్రలను రచించినవారు తక్కువే. మిత్రులు **కవిశిరోమణి** ఆచార్య రావికంటి వసునందన్‌గారు ఆ లోటును పూరించే విధంగా తమదైన విశిష్ట వ్యక్తిత్వంతో చరితార్థులైన పదకొండు మంది మహిళామూర్తుల చరిత్రలను **భారతనారీమణులు** గా సాహితీలోకానికి అందిస్తున్నారు. ముఖ్యంగా బాలబాలికల కోసం ఈ కథలు రచించారు. రేపటి కాబోయే పౌరుల కోసం – మన పూర్వుల వైభవాన్ని, వారు చేసిన సాధననూ, సాధించిన సిద్ధినీ, వారి త్యాగాలనూ, ప్రబోధాలనూ బాలలు అర్థం చేసుకొని వారి వారి జీవితాలను సుసంపన్నం చేసుకుంటారని ఆచార్య వసునందన్‌గారి ఆకాంక్ష.

ఆచార్య రావికంటి వసునందన్‌గారు వృత్తిరీత్యా డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతిగా వున్నా, ప్రవృత్తిరీత్యా ఉత్తమ భావుకులు. అనేక సాహితీ ప్రక్రియల్లో చేయి తిరిగిన రచయిత, కవి, విమర్శకులు, బహుగ్రంథకర్త. పద్యాలను గేయాలను అమితంగా ఇష్టపడే వసునందన్‌గారు బాలబాలికలకోసం సరళమైన భాషతో, వచనంలో కథలుగా "భారతనారీమణులు" రచించారు. ఒక్కొక్క

విదుషీమణి కథ ముగింపులో వారి జీవితం వల్ల కలిగే ప్రబోధాన్ని బాలలకు చక్కగా వివరించారు. స్త్రీ శక్తినీ సామర్థ్యాన్నీ, తన వ్యక్తిత్వంతో దశదిశలకూ చాటిన వీరనారిగా రుద్రమదేవినీ; ధీరగుణానికీ శౌర్య ప్రతాపాలకూ ప్రతీకగా ఝాన్సీ లక్ష్మీబాయినీ; మధురభక్తి తత్త్వానికి ప్రతిరూపంగా మీరాబాయినీ; తమ సంతానాన్నే కాక, దేశ స్వరూపాన్నీ స్వాతంత్ర్యాన్నీ తీర్చిదిద్దడానికి పరిశ్రమించిన మాతృమూర్తులుగా జిజియాబాయినీ, పుత్లీబాయినీ; కూతురిగా, భార్యగా, తల్లిగా, గురువుగా, ఆదర్శమూర్తిగా, తనకుతనే సాటిగా, పవిత్ర ఆధ్యాత్మక క్షేత్రంగా పరిఢవిల్లిన, భారతకీర్తిగా వెలుగొందిన నారీమణి శ్రీ శారదామాతనూ; సేవాభావం మూర్తికట్టిన శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌నీ; ఇంకా కవయిత్రి మొల్లనూ; సౌజన్యమూర్తి సరోజినీనాయుడునూ; సంగీతసరస్వతి భారతరత్న ఎం.ఎస్.సుబ్బులక్ష్మినీ; సంస్కరణాభిలాష కందుకూరి రాజ్యలక్ష్మినీ; భారతదేశ మాజీ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీనీ – ఈనాటి బాలలకు స్ఫూర్తిప్రదాతలుగా అందించిన ఆచార్య వసునందన్ గారి కృషి ప్రశంసనీయం. ఈ కృతి చరిత్రపుటలలో శాశ్వతంగా నిలిచిపోగల ఒక సత్కృతి. ఈ "భారతనారీమణులు" పిల్లల కథల పుస్తకాన్ని తన సహధర్మచారిణి శ్రీమతి రావికంటి విజయలక్ష్మీ వసునందన్‌గారికి అంకితమివ్వడం ఎంతో ఔచితీమంతంగా వుంది. మహిళల పట్ల అభిమానాన్ని మాటల్లో కాకుండా చేతల్లో కూడా చూపించినందుకు మరోసారి వసునందన్‌గారిని అభినందిస్తూ....



# ఆకాంక్ష

**భారతనారీమణులు** అనే ఈకృతి పిల్లలకు స్ఫూర్తిదాయకంగా రచించిన పదకొండు కథల సంపుటి. ఇందులో నేను ఆయాపాత్రల వివరాలకూ, మక్కికి మక్కీగా పుట్టుపూర్వోత్తరాలకూ, తిథివార నక్షత్రాలకూ, జీవిత ఘటనల పట్టికలకూ అంతగా ప్రాధాన్యం ఇవ్వలేదు. ఒక్కొక్క నారీమణి ఏ లక్షణంవల్ల చరిత్ర ప్రసిద్ధిపొందిందో, తరతరాలకూ ఆదర్శప్రాయంగా ఎందుకు నిలిచిందో – అది మాత్రమే చెప్పడానికి ప్రయత్నించాను. అంటే ఈ కథలు వారి వ్యక్తిత్వాలకు సంక్షిప్త స్వరూపాలు (Micro Films) అన్నమాట- కొండ అద్దంలో కొద్దిగానే ఉన్నట్టు. సంక్షేపంగా ఉన్నంత మాత్రాన ఫోటోల్లోని కవళికలు అదృశ్యంకావు. బీజరూపంలో ఉంటాయి.ఎంతగా విస్తరిస్తే అంత పెంపొందుతాయి. కథ నిడివి తగ్గి సారాంశం ఏకధాటిగా సూటిగా అందాలని చేసిన ఒక ప్రయత్నం ఇది. కథానాయికల సంస్కారశక్తి సూటిగా రసగుళికలాగా పిల్లలకు ఆస్వాదయోగ్యం కావాలని ఆశయం. అందువల్ల పసిమనసులు ప్రభావితాలై జీవనరీతులు దిద్దుకోవాలని ఆశ.

– వసునందన్

# కవిశిరోమణి
# ఆచార్య రావికంటి వసునందన్



జననం : 04.05.1949

జన్మస్థలం : కమాన్‌పూర్
కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్

తల్లిదండ్రులు : కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య

విద్య : ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి

ఉద్యోగం : తెలుగు ప్రొఫెసర్
ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్, యు.జి.సి. మేజర్ రీసర్చ్ ప్రాజెక్ట్
డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

## రచనలు

### కథా కావ్యాలు

రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971)

గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978)

భారతం (పద్య కథాకావ్యం - 1980 - డా॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారకపురస్కారం పొందిన కృతి)

బలి (గేయ కథాకావ్యం - 1981)

కృష్ణం కలయ... (పద్య కథాకావ్యం - 2009)

అష్టాక్షరి (పద్య కథాకావ్యం - 2009)

కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్ పద్యరత్నావళి (2009)

### దీర్ఘ కావ్యాలు

త్రయి (1982)

మనస్సు (2004)

పిల్లలమఱ్ఱి (2006)

మట్టిముద్దలు (2007)

ఆయుధం కవిత్వం (2007)

ప్రవాహిని (2008)

భక్తి (2009)

## గేయ కావ్యాలు

శ్రీరామ చరితామృతమ్ (పాటల్లో రామాయణం - 1992)
శ్రీవేంకటేశ్వర తారావళి (సంకీర్తనలు-2005)
ఎందరో మహానుభావులు (జీవిత చరిత్రలు - 2006)

## సాహితీ విమర్శ - పరిశోధన

భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980)
భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985)
అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987)
ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990)

## వచన కవితలు

సాధన (కవితా సంపుటి - 1981)
కలం కదిలితే... (కవితాసంపుటి - 2003)
మెరుపు మెరిస్తే... (కవితా సంపుటి-2004)
వాన కురిస్తే... (కవితా సంపుటి-2005)
నేల నవ్వితే... (కవితా సంపుటి-2006)
మనసు నిండితే... (కవితా సంపుటి-2006)
సింగిణీ మొలిస్తే... (కవితా సంపుటి-2006)
నెమలి ఆడితే... (కవితా సంపుటి-2008)
గుండె పొంగితే... (కవితా సంపుటి-2009)

## వివిధ కృతులు

వేణీ సంగమం (గేయం, పద్యం - 1975)
ప్రజావిజయం (రేడియోరూపకం - 1990)
ప్రయోజన దండకాలు (దండకాలు - 1993)
జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియో క్యాసెట్స్ - 1994)
లోవెలుగు (ముక్తకాలు - 2004)
రావికన్నులు (సంక్షిప్త కవితలు-2006)
అనుయోగం (త్రిపదులు-2009)
అడుగడుగునా! (సంక్షిప్త కవితలు-2009)



## బాల సాహిత్యం

బాలజ్యోతులు (పిల్లల కథలు-2007)
బాలబ్రహ్మం (దీర్ఘకావ్యం-2008)
భారతనారీమణులు (పిల్లల కథలు-2009)

## అనువాదాలు

దౌడ్ (హిందీ అనువాదం) డా.ఎం.రంగయ్య (2006)
రెసొల్యూట్ మైండ్ (ఇంగ్లీష్ అనువాదం) డా.బి.రామచంద్రయ్య (2006)
విరాట్ ఏకతా వట్ (హిందీ అనువాదం) డా. ఎం. రంగయ్య (2008)

## ముద్రణలో

భక్తశిఖామణులు (పిల్లల కథలు)
ధీరతెలంగాణా (దీర్ఘకావ్యం)

## పురస్కారాలు

ఎ.పి.ఎ.యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982)
డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం, హైదరాబాద్ (1982)
శ్రీ జమిలి నమ్మాళ్వార్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1990)
శ్రీ తేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1993)
శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి, హైదరాబాద్ (1993)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి, హైదరాబాద్ (2002)
డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం, కోరుట్ల (2003)
కవిశిరోమణి బిరుదప్రదానం - భారతీ సాహిత్య సమితి, కోరుట్ల (2003)
డా.జె.ఆర్.ఇ.టి.రజతోత్సవస్వర్ణపతక,స్వర్ణకంకణపురస్కారం,జగిత్యాల (2003)
వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం, కరీంనగర్ (2004)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం, హైదరాబాద్ (2004)
పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం ధర్మనిధిపురస్కారం, హైదరాబాద్ (2004)
ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం - భాషావేత్త పురస్కారం, రంగారెడ్డి (2006)
శ్రీ దోమా వేంకటస్వామిగుప్త సాహిత్య పురస్కారం, కడప (2007)
తేజ ఆర్ట్ క్రియేషన్స్, సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2007)
భారత పర్యావరణ పరిరక్షణ గవాక్షం - రంగారెడ్డి జిల్లా పురస్కృతి (2008)
తేజ ఆర్ట్ క్రియేషన్స్-ఆచార్య తిరుమల సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2008)

# కథామణులు







# రుద్రమదేవి

స్త్రీ శక్తినీ సామర్థ్యాన్నీ, తన విశిష్ట వ్యక్తిత్వంతో దశ దిశలకు చాటిన వీరనారి రుద్రమదేవి. తండ్రి గణపతిదేవ చక్రవర్తి అల్లారుముద్దు ఆలన పాలనలో రుద్ర దేవునిగా, రుద్రదేవ యువరాజుగా, రుద్రదేవ మహారాజుగా రూపొందిన పురుష వేషధారిణి ఆమె. గుర్రపుస్వారి, కత్తిసాము, యుద్ధవిద్యలన్నిటిలోనూ, పరిపాలనా ధిషణలోనూ ఆరితేరిన సామర్థ్య స్ఫూర్తి రుద్రమాంబ.

నేడు వరంగల్లుగా పిలువబడుతున్న ఓరుగల్లులో 'కాకతి' అనే ఒక గ్రామదేవత ఉండేది. ఆమె పేరుమీద ఏర్పడిందే కాకతీయవంశం, కాకతీయ సామ్రాజ్యం. ఆ వంశానికి చెందిన గణపతిదేవ చక్రవర్తి హనుమకొండలోని వేయి స్తంభాల గుడి కట్టించాడు. కృష్ణా గోదావరీనదుల నడుమ వ్యాపించిన గొప్ప సామ్రాజ్యానికి చక్రవర్తి గణపతి దేవుడు. ఈయనకూ పట్టపురాణి సోమాంబకూ పుట్టిన బిడ్డ రుద్రమదేవి. ఈమె చెల్లెలు గణపాంబ. కొడుకులులేని లోటును రుద్రమదేవిని కొడుకుగా పెంచుకొని తీర్చుకున్నాడు గణపతి దేవుడు. ఆమెకు గుర్రపు స్వారి, ఈటె విసరడం, కత్తి సాము, విలువిద్య, కర్రసాము వంటి వీరోచిత, పురుషోచిత విద్యలన్నీ నేర్పించాడు. మల్లయుద్ధంలో పెద్ద దిట్ట రుద్రమాంబ. ఆమెకు మగవేషం వేయించి, రుద్రదేవుడు అని పేరుపెట్టి రాజసభకు తీసుకు వెళ్లి, రాజ్యాంగ



వ్యవహారాలు, మంత్రాంగాలు, పరిపాలనా విషయాలు నేర్పించాడు. సైనిక శిక్షణ, వ్యూహరచన, యుద్ధపు ఎత్తికోళ్లు వంటి అంశాల్లో ఆరితేరింది రుద్రమ్మ. ఎంతోమంది పురుషపుంగవులైన వీరయోధుల కన్నా నైపుణ్యంతో రాటుతేలింది ఆమె. ఆమె కత్తిపట్టుకుంటే ఎదుటివారు క్షణాల్లో పరాజితులయ్యేవారు. తన రాజ్యవారసునిగా ఆమెనే ప్రకటించి పట్టాభిషేకం చేశాడు గణపతిదేవుడు. రుద్రమదేవ యువరాజుగా ఆయన తర్వాత రుద్రదేవ మహారాజుగా సువిశాల కాకతీయ సామ్రాజ్యాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించింది రుద్రమ్మ. స్త్రీ శక్తికి ఎదురులేదని నిరూపించింది.

రుద్రమదేవి కుమార్తె ముమ్మడమ్మ కుమారుడే రుద్రమదేవి తర్వాత కాకతి సామ్రాజ్యానికి చక్రవర్తి ఐన ప్రతాపరుద్రుడు. గణపతిదేవుని లాగానే రుద్రమదేవికి కూడా పురుష సంతానం కలుగలేదు. అందువల్ల ఆమె తన మనుమడిని రాజ్య వారసునిగా స్వీకరించి అతన్ని అన్నివిధాలా పరిపాలనా సమర్థునిగా తీర్చిదిద్దింది. చాళుక్యరాజు వీరభద్రేశ్వరుడు రుద్రాంబ భర్త.

గణపతిదేవుడు చాలా శక్తిమంతుడైన చక్రవర్తి. సామ్రాజ్యాన్ని చాలా పటిష్టం చేశాడు. అందువల్ల కొంతవరకూ రుద్రమదేవి పరిపాలన తేలిక అయ్యిందని చెప్పవచ్చు. కాని స్త్రీ పరిపాలన సహించలేని కొందరు సామంతులూ, రాజ్యాంగ సభలోని కొందరు అధికారులూ, మంత్రులూ, సేనానులూ ఆమెపైన తీవ్రమైన తిరుగుబాటు చేశారు. ఆమె సవతి సోదరులు హరిహరదేవుడు, మురారి దేవుడు ఈ అంతర్గత విప్లవానికి నాయకత్వం వహించారు. ఎంతో చాకచక్యంతో, సామర్థ్యంతో ఆ అంతశ్శత్రువులందరినీ అణచివేసి తన పరిపాలన సుస్థిరం చేసుకున్నది రుద్రాంబ. ఈ అంతశ్శత్రువులనే కాక బహిశ్శత్రువులైన పాండ్యరాజు జటావర్మనూ, మూడులక్షల సైన్యంతో ముట్టడించిన యాదవవంశానికి చెందిన దేవగిరి రాజు మహదేవరాజునూ అవక్రపరాక్రమంతో నిర్జించింది.

నిడదవోలులో రుద్రమ అత్తింటివారు చాళుక్యులూ, కోనసీమలో ఆమె బంధువులైన హైహయులూ తిరుగుబాటు చేసి తాము స్వతంత్రులమని శాసనాలు వేయించుకున్నారు. బంధువులతో ఎందుకులే? అని ఆమె కొంతవరకు సహించినా; అది అలుసుగా తీసుకొని చివరకు వారు ఓరుగల్లు కోటనే ముట్టడిస్తే అపరకాళిలా విజృంభించి సుడిగాలిలా వారిని బెదరగొట్టింది రుద్రమాంబ. దానితో కాకతీయ సామ్రాజ్యం ఎల్లలు గోదావరి ఉత్తర తీరానికి విస్తరించాయి. ఇలా దక్షిణాపథాన



తూర్పు పడమర రాజ్యాల్లో ఆమె శాసనం దుర్నిరీక్ష్యంగా వెలుగొందింది. గణపతి దేవుని కాలంనాటికన్నా ఆమె కాలంలో సామ్రాజ్యం ఎంతో విస్తరించింది.

ఆమె రాజ్యకాలం క్రీ.శ.13వ శతాబ్దం. ఇంతటి సమర్థతతో పరిపాలించిన రుద్రమాంబ చల్లని ఏలుబడిలో లలితకళలూ, సంస్కృతీ, వాణిజ్య వ్యాపారాలూ, సుఖశాంతులూ వెల్లి విరిశాయి. ఆకాలంలోనే తన కుమార్తె రుయ్యమాంబ ఒక బ్రాహ్మణుడైన అన్నయామాత్యుని వరిస్తే ఎంతో సంస్కారంతో వారి ప్రేమ వివాహాన్ని జరిపించిన అభ్యుదయశీల రుద్రమాంబ !

చూశారా బాలలూ! స్త్రీ తలుచుకుంటే, నడుంకట్టి నిలబడితే సాధించలేనిది ఏదీ లేదని ఎలా నిరూపించిందో రుద్రమాంబ - రుద్రదేవ మహారాజు !



# మహాకవయిత్రి మొల్ల

శ్రీరామకథను 871 గద్య పద్యాలతో మధుర పదబంధాలతో మనోహర వర్ణనలతో విరచించిన మహాకవయిత్రి మొల్ల. తెలుగు పలుకు బడులు, తెలుగు సంస్కృతి, మొల్ల రామాయణం నిండా కోకొల్లలు. తెలుగు మహిళామణులకు గర్వకారణం మొల్ల.

ఈమె పేరుకు తగ్గట్టే ఈమె పద్యాల్లో మొల్లలు, మల్లెలు, విరజాజులు కురుస్తుంటాయి. తనకంటే ముందు భాస్కరాదులు తెలుగులో రామాయణాన్ని రచించినా, ఆ సంస్కృత సమాస బాహుళ్యాన్ని పెడద్రోసి, అచ్చమైన తెలుగు పలుకుబడులతో, తేటతేనియల పదబంధాలతో తిరిగి రామాయణం వ్రాయాలని సంకల్పించినట్టున్నది మొల్ల. అందుకు సాక్ష్యంగా



**కందువ మాటల, సామెత**
**లందముగా గూర్చి చెప్ప**
**నది తెనుగునకున్ పొందై** అని

శ్రీరామచంద్రుడు రామాయణ రచనకు తనను ఆదేశించాడని చెప్పడంలో మొల్ల తన రచనారీతులను అన్యాపదేశంగా చెప్పినట్లైంది.

తాను అంతగా చదువుకోకున్నా – గోపవరపు శ్రీ కంఠమల్లేశు వరము చేత కవిత్వం చెప్పడం నేర్చుకున్నానని మొల్ల కావ్యాదిలో చెప్పడంతో



నెల్లూరు సమీపంలోని ఒక పల్లె 'గోపవరం' ఈమె ఊరని తెలియవస్తున్నది. ఈమె వీరశైవుల ఇంటిలో కుమ్మరికులంలో జన్మించిందని లోకాభిప్రాయం. గురులింగ జంగమార్చనపరుడూ, భక్తిరతుడూ, బాంధవ హితుడూ ఐన ఆతుకూరి కేసన వరపుత్రిక మొల్ల. ఆమె జననం ఆ ఇంటికే కాదు తెలుగు నేలకే ఒక వరం, అదృష్టం.

స్త్రీ కాబట్టి సహజ పక్షపాతంతో, సీతపాత్రను అత్యద్భుతంగా చిత్రించింది మొల్ల. స్త్రీ కాబట్టే ఈమె రచనలో శబ్దాలు మృదుమధురాలై, సమాసాలు శిరీష కుసుమపేశలాలై ఉన్నాయి. వర్ణనలు అత్యద్భుతాలు. ఈమె 'వెన్నెల' వర్ణన అసామాన్యం. అనితరసాధ్యం. వెన్నెల్లోనట – **చెట్లన్నీ పారిజాతాలై, ఋషులందరూ నారదులై, పాములన్నీ ఆదిశేషులై, స్త్రీలందరూ శారదలై పోయారట.** తెల్లదనానికి ఇంత అత్యద్భుతమైన కల్పన నభూతో నభవిష్యతి – ఈ ఒక్కటీ చాలు ఆమెకు కవితాశక్తి నిరూపణకు.

పోతనవలెనే ఈమెకూడా శ్రీరామాజ్ఞతో, శ్రీరామాంకితంగా రామాయణం చెప్పడం ఆమె భక్తికి నిదర్శనం. **శ్రీ మహిమాభిరాముడు, వశిష్ఠ మహాముని పూజితుండు** అని శ్రీకారంతో ప్రారంభించిన కావ్యాది పద్యంలో **శ్రీరాముడు ప్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్ల కాలమున్** అని మొల్ల ఆశించడం – తనకోసం ఏదీ కోరుకోకపోవడం – ఆమె కేవల సమాజహిత కాంక్షకు నిదర్శనం.మొల్ల కృష్ణదేవరాయల నాటి తెనాలి రామకృష్ణుని సమకాలికురాలని కొందరి అభిప్రాయం. ఆమె రచనలో ప్రబంధశైలి కొట్టవచ్చినట్టుగా కనపడడం దీనికి కారణం కావచ్చు.

సుమధుర పదబంధాలతో, సమాసాలతో, చక్కటి అలంకారాలతో, ప్రతిపద్య రసస్ఫోరకంగా రామాయణాన్ని రచించిన మొల్ల తెలుగు నారీలోకానికే తలమానికం.

చూశారా బాలలూ ! సామాజికాంశాలతో పాటు, కళారూపాల్లోనూ పురుషులదే పై చేయి ఐన ఆ కాలంలోనే మహా కవయిత్రి మొల్ల ఎంత అద్భుతమైన, కలకాలం నిలిచిపోయే రామాయణ రచన చేసిందో! స్త్రీ తలుచుకుంటే సాధించలేనిది ఏదీ లేదని ఎలా నిరూపించిందో ! తెలుగు కవిత్వ సామ్రాజ్యంలో ఆమెది ఎదురులేని, చెక్కుచెదరని సింహాసనం తరతరాలకీ.



# మీరాబాయి

మధురభక్తి తత్వానికి ప్రతీక మీరాబాయి. జీవితంలోఎన్ని కష్ట నష్టాలు ఎదురైనా లక్ష్యపెట్టక శ్రీకృష్ణగానామృత పారవశ్యంతో తానున్న చోటునే నంద గోకులంగా మార్చివేసిన అనన్య భక్తురాలు. భగవంతుడినే భర్తగా భావించి ఆరాధించడం మధుర భక్తి సంప్రదాయం. దీనికి ఆద్యులు బాలకృష్ణుని కాలంనాటి బృందావన గోపికలు.

భజన సంప్రదాయం, కీర్తన మార్గం, సుమధుర నాట్యం మూడుపాయలుగా ఉప్పొంగిన భక్తి రసగంగ మీరాబాయి. కృష్ణుని గురించి పాడుతూ ఆడుతూ దివ్యతేజంతో వెలిగిపోయిన ఈమె లౌకికజీవితంలో అతి దురదృష్టవంతురాలు. చిన్నప్పుడే తల్లి పోయింది. అతి చిన్న వయసులోనే కట్టుకున్న భర్త కాలగర్భంలో కలిసిపోయాడు. ఈ విధంగా కష్టాల కడలి మీరా హృదయం. గిరిధర గోపాలునే తన ఆలోచనల నిండా నింపుకున్న ఈమె ఎన్నడూ కలతలకు కన్నీరు కార్చలేదు.



"మీరాకే ప్రభు ! గిరిధర్ నాగర్"

అనే ప్రసిద్ధమైన పల్లవితో తన స్ఫూర్తి పండించుకొన్న మీరాబాయి రాథోడ్



రాజ వంశానికి చెందిన మేడతరాజు దూదాజీ కుమార్తె. 1498లో జన్మించిందని ప్రతీతి. చిత్తూరుకు చెందిన భోజరాజుతో 1516లో చాలా వైభవంగా ఆమె వివాహం జరిగింది. రాజస్థాన్ రాజవంశాల ఆచారం ప్రకారం పెళ్లికూతురు పక్కన పెళ్ళికొడుకు ప్రతీకగా అతని ఖడ్గాన్ని ఉంచడం సంప్రదాయం. కాని మీరాబాయి ఆ ఖడ్గంతో పాటుగా తనకు చిన్నప్పుడు రైదాస్ అనే సాధువు ఇచ్చిన కృష్ణ విగ్రహాన్ని కూడా పక్కన పెట్టుకున్నది. ఇందులోనే ఆమె కృష్ణ భక్తి మయ విచిత్ర వ్యక్తిత్వం బయటపడుతున్నది. ఆమె తన జీవితంలో ఎన్నడూ భర్తను ఎదిరించలేదు, అతని మాటకు ఎదురు చెప్పలేదు. అన్నివేళలా అతని స్థానాన్నీ గౌరవాన్నీ అతనికి నిలిపింది. కానీ కృష్ణభక్తి మాత్రం చిన్నతనం నుండీ మరువలేదు. కృష్ణ సంకీర్తనం విడువలేదు. గోపాలుని పాటతో పాటు గజ్జెలు కట్టుకొని చేసే మయూర నాట్యం మానలేదు. ఆమె మనస్సూ మస్తిష్కం ఆలోచనలూ అన్నీ కృష్ణమయమే! పైగా కృష్ణుడిని ఎవరైనా ఏమైనా అంటే ఆమె సహించేది కాదు, వారికి దూరంగా వైదొలగేది. ఈ ద్వంద్వ ప్రవర్తన అత్తింటివారికి అరుగుదు పడలేదు. సహజంగా శక్తి ఆరాధకులైన చిత్తోడ్ రాజకుటుంబ సభ్యులు ఆమె కాళికను కాక కన్నయ్యను ఆరాధించడాన్ని సహించలేక ఆమెను రాచి రంపాన పెట్టేవారు. మీరా చిన్నవయసులోనే పెళ్లైన ఐదేళ్ళకే 1521లో భర్త మరణించడంతో అత్తింటి ఆరళ్లకూ, ఆమె కష్టాలకూ అంతేలేకుండా పోయింది. ఒక రాణి గజ్జెకట్టుకొని అందరిలో ఆడటమేమిటని అందరూ ఆమెను అమితంగా బాధించేవారు.

ఇవన్నీ ఆమె అవగింజంతైనా లెక్కజేసేదికాదు. నిరంతర కృష్ణనామ ధ్యానం, సంకీర్తనం, నాట్యం – మనసా వాచా కర్మణా ఆమెకు తెలిసిన అంశాలు. అందరికీ కృష్ణతత్వాన్ని తెలియజేసే సత్యాలు. ఈ విధంగా సాటిలేని ఒక గొప్ప కృష్ణభక్తి ప్రచారకురాలు మీరాబాయి. అత్తింటివారు ఆమెను పిచ్చిదని త్రోసివేసే సజ్జనులు ఆమె ముఖవర్చస్సునూ, వైఖరినీ, తన్మయత్వాన్నీ దర్శించి ఆమె కలియుగ రాధ అనీ, ఆమె పదపద్మాలు తాకితే తమ పాపాలన్నీ పటాపంచలైపోయి సకల శుభాలూ కలుగుతాయనీ ప్రగాఢంగా విశ్వసించి ఆమె ఎక్కడ ఉంటే అక్కడ గుంపులు గుంపులుగా చేరేవారు. ఎంతో గౌరవించేవారు. ఆమె ఆటా పాటా చూసి ఆనందించి తరించేవారు.

ఫలితంగా రాజ కుటుంబీకులు ఆమెను చంపివేయాలని నిర్ణయించుకొని ఎన్నో ప్రయత్నాలు చేశారు. విష్ణుభక్తి వల్ల ప్రహ్లాదుని పట్ల విరోధుల ప్రయత్నాలు

నిష్ఫలమైనట్టుగా మీరాను చంపాలనే ప్రయత్నాలు కూడా ఆమె కృష్ణభక్తి వల్ల విఫలమయ్యాయి. పూలబుట్టలో కాలసర్పాన్ని పెట్టి పంపితే ఆమె తాకగానే అది సాల గ్రామంగా మారిపోయింది. సాలగ్రామం అంటే విష్ణుభక్తులు శ్రీమహా విష్ణువు ప్రతిరూపంగా పూజించే గుండ్రని నునుపైన రాయి. గిన్నె నిండా పంపిన విషం కృష్ణుడిని ప్రార్థిస్తూ ఆమె తాకగానే అమృతంగా మారిపోయింది. మీరా మరింత ప్రకాశవంతంగా వెలిగిపోయింది. ముళ్లపరుపు మీద పడుకోమని రాజు ఆజ్ఞాపిస్తే, ఆమె స్పర్శతో ముళ్లన్నీ పూలుగా మారిపోయాయి. తాను పూజించే దేవుని మహిమ వల్లనే ఇదంతా జరిగిందని మీరా నమ్మకం. ఈ స్థితిలో ఉన్న ఆమెను పిచ్చిదని ముద్రవేసి రాజకుటుంబీకులు రాచనగరునుండి తరిమివేశారు. మీరాను వేలాదిమంది భక్తులు అనుసరించారు. కృష్ణభక్తి పారవశ్యంలో పాడుతూ ఆడుతూ "మేరేతో గిరిధర్ గోపాల్ దూస్‌రోం నకోయీ" (గిరిధరుడైన గోపాలుడే నావాడు కాని ఇతరులెవ్వరూ కారు) అనే భావంతో ఆమె బృందావనాన్ని చేరుకుంది. బృందావనం చిన్నతనంలో కృష్ణుడు నివసించిన పుణ్యస్థలం. గోపికలతో ఆడుకొన్న దివ్యస్థలం. అక్కడ ఒక అత్యద్భుతం జరిగింది. ఆ కాలంలో బృందావనంలో జీవగోస్వామి అనే ఒక ప్రసిద్ధ సాధువు తన అనుయాయులతో నివసిస్తుండేవాడు. అక్కడ ఆయన అధికారం చెల్లుతుండేది. ఆయన స్త్రీద్వేషి, ఆధ్యాత్మిక సాధనకు స్త్రీ ముఖదర్శనం కూడా ప్రతిబంధకమనే ఆలోచనతో ఆయన ఆడవాళ్లను చూచేవాడు కూడా కాదు.

ఆడుతూ పాడుతూ బృందావనం చేరుకున్న మీరాబాయిని ఆయన శిష్యులు లోపలికి అడుగుపెట్టనివ్వలేదు. కారణం అడిగితే మా గురువుగారు స్త్రీ సందర్శనం పరిహరిస్తారని – జవాబు. అది విన్న మీరా అపహాస్యంగా ఒక చిరునవ్వు నవ్వి "ఈ లోకంలో గిరిధర గోపాలుడొక్కడే పురుషుడనుకున్నాను. ఇంకా వేరే పురుషులు కూడా ఉన్నారా?" అని ఒక ప్రశ్నవేసి వెనుదిరిగింది. దానికి – పరమాత్ముడైన శ్రీకృష్ణుడొక్కడే పురుషుడు, తక్కిన జీవాత్మలన్నీ స్త్రీ స్వరూపాలు – అని వేదాంతార్థం. అది గోస్వామి శిష్యులకూ, మీరావెంట ఉన్న భక్తులకూ కూడా అర్థం కాలేదు. ఇరు వర్గాల మధ్యా పెద్ద గొడవ జరిగింది.

ఆ అలికిడికి స్వామి వెలికి వచ్చి అల్లరి ఏమిటని అడిగాడు. "స్వామీ! ముఖంలో మాత్రం చెప్పరాని తేజస్సు! ఎవరో ఒక పిచ్చిది, చిరిగిన బట్టలతో ఉన్నది, కాని ఇలా అన్నది" అని మీరా వేసిన ప్రశ్న గురువుగారికి అందించారు శిష్యులు. అది



విన్న గోస్వామి తల తిరిగిపోయింది. ఆలోచనలో పడ్డాడు. సంస్కారవంతుడు కాబట్టి ఆ ప్రశ్నలోని ఆంతర్యం ఆయనకు బోధపడింది. ఉరుకులు పరుగులతో శిష్యులు వెన్నంటి రాగా మీరాబాయి దగ్గరికి వెళ్లి ఆమె కాళ్లమీద పడి పశ్చాత్తాపంతో లెంపలు వేసుకొని క్షమాపణలడిగాడు. సాదరంగా వైభవంగా ఆమెను బృందావనంలోకి తీసుకువెళ్లాడు.

"శ్రీకృష్ణుడు ప్రభువు. మీరా అతడి సేవకురాలు. ఆ భావనతోనే నేను తన్మయురాలినవుతాను. తరిస్తాను. లోకాలను తరింపజేస్తాను."

అనే ప్రగాఢ విశ్వాసంతో, ప్రవర్తనతో, కృష్ణుని పాటతో, ఆటతో బ్రతికినంత కాలం బృందావనాన్ని కలియుగ నందగోకులంలా మార్చి వేసింది మీరా!

చూశారా బాలలూ! నిష్కల్మషమైన భగవంతుని మీది భక్తి ఎంత శక్తినీ, జీవన్ముక్తినీ ప్రసాదిస్తుందో! దానికి ఒక చారిత్రక తార్కాణం మీరాబాయి.



# ఝాన్సీ లక్ష్మీబాయి

ధీరగుణానికీ శౌర్యప్రతాపాలకూ ప్రతీక ఝాన్సీ లక్ష్మీబాయి. ఆంగ్లేయ సింహాసనాన్ని ప్రకంపింపజేసిన పరాక్రమం, అనుపమానమైన దేశభక్తి, అసమాన పరిపాలనాశక్తి ఆమె దివ్య గుణాలు.

ఝాన్సీలక్ష్మీబాయి అసలు పేరు మనూబాయి. పీష్వా రెండవ బాజీరావు సలహామండలి సభ్యుడు మోరోపంత్ కుమార్తె ఆమె. చిన్నప్పటి నుండీ కత్తిసాము, కర్రసాము, తుపాకి పేల్చడం, అశ్వచాలనం వంటి వీరోచిత విద్యలు ఆమెకు నేర్పించాడు తండ్రి. ఎందరో ఆదర్శ భారత నారీమణుల గాథలు నూరిపోశాడు. ఆ విధంగా ఆమెలో సుసంస్కారం, సుశిక్షిత వ్యక్తిత్వం మూడుపూవులు ఆరుకాయలుగా వికసించాయి.





మోరోపంత్ భార్య బాగీరథీ బాయి గొప్ప అందగత్తె. తల్లిలాగే మనూబాయి కూడా పొడవైన కురులు, పెద్ద పెద్ద కళ్ళు, ముఖంలో ఉట్టిపడే రాచఠీవితో ఎంతో అందంగా ఉండేది. ఆమె నాల్గవ ఏటనే ఆమెకు మాతృ వియోగం కలిగింది. దానితోనే ఒకవిధంగా మనూబాయి జీవితంలో దురదృష్టపు నీడలు కమ్ముకోవడం ప్రారంభించాయని చెప్పవచ్చు. భార్యావియోగంతో పాటు కుమార్తె పాలన, పోషణ బాధ్యతలు కూడా మోరోపంత్ పైన పడ్డాయి. ఐనా కూతురిని ఎంతో ప్రేమగా, ఆదర్శపూర్ణంగా పెంచాడు తండ్రి. క్రీ.శ. 1842లో ఝాన్సీ రాజు గంగాధరరావుతో మనూబాయి వివాహం జరిగింది. దాంతో మనూబాయి ఝాన్సీరాణి లక్ష్మీబాయిగా మారిపోయింది.

ఈస్టిండియా కంపెనీ పేరుతో క్రీ.శ. 18వ శతాబ్దంలో భారతదేశానికి వ్యాపార నిమిత్తం ఆశ్రితులై వచ్చారు ఆంగ్లేయులు. క్రమక్రమంగా ధనమూ, బలగమూ, బలమూ పెంచుకొని భారతదేశ రాజుల మధ్య అంతఃకలహాలు రేకెత్తిస్తూ, కుట్రలతో కుతంత్రాలతో ఈస్టిండియా కంపెనీవారు ఇండియాను కబళించడానికి, ఆంగ్లేయ సార్వభౌమత్వం నెలకొల్పడానికి ప్రయత్నిస్తున్న ప్రారంభదినాలు అవి. దురాశోపహతులైన కొందరు భారత ద్రోహరాజన్యులు కూడా వారి పథకాలకు సహకరిస్తూ, స్వయంగా తాము బానిసలవుతూ, దేశ స్వాతంత్ర్యాన్నీ బలిపెడుతున్న సమయం.

ఝాన్సీ ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ఒక ముఖ్య నగరం. దానికి లక్ష్మీబాయి భర్త గంగాధరరావును క్రీ.శ. 1838లో ఆంగ్లేయులు ప్రభువుగా నియమించారు. అందులో రెండు షరతులు విధించారు. మొదటిది ఎప్పుడు అవసరమైతే అప్పుడు ఝాన్సీ రాజ్యం ఆంగ్లేయులకు బేషరతుగా అన్నివిధాలా సహాయం చెయ్యాలి. రెండవది భవిష్యత్తులో ఝాన్సీకి ఎవరినైనా రాజుగా పట్టాభిషేకం చేసేముందు విధిగా ఆంగ్లేయుల అనుమతి తీసుకోవాలి. ఈ నిబంధనలే ఆ తర్వాత ఝాన్సీ రాజ్య పతనానికి దారితీశాయి. ఇటువంటి షరతులు, నిబంధనలతోనే ఆంగ్లేయులు భారత ప్రభువులను సామంతులుగా, ఒక విధంగా బానిసలుగా మార్చి వేశారు.

గంగాధరరావు గొప్ప పరిపాలకుడు. అంతకుముందు ఝాన్సీరాజు రఘునాథరావు కోశాగారాన్ని ఎండించాడు. గంగాధరరావు కోశాగారాన్ని ధనంతో నింపడమేకాక గో సంతతినీ, అశ్వ బలాన్నీ, గజ బలాన్నీ, ఫిరంగి దళాన్నీ పెంపొందించాడు. 5వేల కాల్బలం, 500 గుఱ్ఱపు దళం రాటు దేలింది. ఐనా

ప్రయోజనం లేకపోయింది. ఎందుకంటే రాజ్యంలో బ్రిటిష్ సైన్యం కూడా ఉంది. దాన్ని పోషించవలసిన బాధ్యత కూడా ఝాన్సీ రాజుదే. అందుకోసం చాలా పెద్ద మొత్తంలో డబ్బు కర్చు ఔతుండేది.

ఈ పరిస్థితుల్లో లక్ష్మీ బాయికి ఒక కొడుకుపుట్టి, పుట్టిన మూడవ నెలలోనే చనిపోయాడు. ఇది రాజదంపతులకే కాక రాజ్యానికే ఒక పెద్ద విఘాతం. కారణం అప్పుడు గవర్నర్ జనరల్‌గా ఉన్న లార్డ్ డల్హౌసీ కఠిన మనస్తత్వం, క్రూర పరిపాలన. భారతీయ ప్రభువులకు "కాలికి వేస్తే మెడకూ – మెడకు వేస్తే కాలికీ" బిగించిన విధానాలు, నియమాలు. వాటిలోముఖ్యమైనది – సంతానం లేకుండా ఏ రాజైనా చనిపోతే, అతనిరాజ్యం బ్రిటిష్‌వారు హస్తగతం చేసుకొని, రాజ కుటుంబీకులకు కేవలం భరణం మాత్రమే చెల్లించే పద్ధతి. ఇలాంటి నియమాలతోనే ఆంగ్లేయులు అనేక రాజ్యాలు చేజిక్కించుకున్నారు. దురదృష్టవశాత్తూ ఆ డేగ కన్ను ఝాన్సీ రాజ్యం మీద కూడా పడింది.

గంగాధరరావు వార్ధక్యంలో అడుగు పెట్టాడు. పసివాడి మరణం ఆయనకు తట్టుకోలేని దెబ్బ. పరిస్థితులా అగమ్యగోచరంగా ఉన్నాయి. ఆ దశలో రాజ దంపతులు ఆనందరావు అనే ఒక బాలుడిని దత్తత తీసుకొని ఆయనకు దామోదరరావు అని నామకరణం చేశారు. ఈ దత్తపుత్రునికి పట్టంకట్టి, సంరక్షకురాలిగా ఝాన్సీలక్ష్మీబాయిని నియమించడానికి అనుమతి ఇవ్వవలసిందిగా రాజు గంగాధరరావు లార్డ్ డల్హౌసీకి ఒక వినతి పత్రం పంపించాడు. ఆ తర్వాత కొద్దిరోజుల ఆనంతరం ఆయన స్వర్గస్థుడయ్యాడు. రాణీ లక్ష్మీబాయి తన పద్దెనిమిద ఏటనే విధవగా మారింది. గుండెపగిలే బాధలో, గుండె మీద పసిబాలుడు దామోదరరావు – ఆమె కష్టాలకు అంతే లేదు.

ఇదే అదనని భావించి కుటిల కర్కశ డల్హౌసీ ప్రభుత్వం గంగాధర రావుకు దత్తతద్వారా తన వారసుడిని ఎంపిక చేసుకునే హక్కులేదనీ, తక్షణం బ్రిటిష్ సామ్రాజ్యంలో ఝాన్సీని విలీనం చెయ్యాలనీ, రాణి కోటను వదలిపెట్టి, పట్టణంలో రు. 5,000/– భరణంతో నివసించాలనీ – ఆదేశాలు పంపించింది. దాంతో మొత్తంగా కుప్పకూలినట్లైపోయింది లక్ష్మీబాయి. ఐనా మూర్తీభవించిన ధీరవనిత కాబట్టి తేరుకొని దైవధ్యానంలో, దేహపరిశ్రమలో, యుద్ధవిద్యాభ్యాసంలో కాలం గడుపుతూ బానిసత్వపు సంకెళ్లనుండి దేశం బయటపడే దారుల కోసం నిరీక్షించసాగింది.



బ్రిటిష్ కుటిలనీతిద్వారా సంతానం లేని కారణంగా రాజ్యాలు కోల్పోయిన రాజవంశీకులు, వారి సైన్యాలు, హితైషులు అందరూ ప్రభుత్వం పట్ల కసితో కక్షతో ఉడికిపోతున్న తరుణం అది. తాంత్యాటోపే, రఘునాథసింహ, జవహర్ సింహ వంటి స్వాతంత్ర్యాభిలాషులు రహస్యంగా వచ్చి లక్ష్మీబాయిని కలిసి మంతనాలు చేస్తుండేవారు. బ్రిటిష్ వారితో పోరాటానికి సిద్ధమైన పంజాబీ సిక్కు సేనను రాణి గమనించింది. ఆమెకు కథియవార్ తెల్ల గుర్రాలంటే ఎంతో ఇష్టం. మగవేషంలో ఇనుపశిరస్త్రాణం, దానిపై తలపాగా, ఇనుపకవచం, రెండుపక్కలా చురకత్తి, పిస్తోలు, ఖడ్గం ధరించి గుర్రపు స్వారీ చేస్తూ ఆమె పర్యటించేది. అసంతృప్తి వర్గంలోని నానా సాహెబ్, రావు సాహెబ్, అయోధ్య నవాబు, ఢిల్లీ ప్రభువు బహదూర్‌షా వంటివారు ఆమెను రహస్యంగా కలుసుకొని సమాలోచనలు చేసేవారు.

రాణి కాశీ వెళ్ళి అక్కడి రాజకీయ స్థితిగతులనూ, ప్రజల మనోభావాలనూ గమనించాలని ఎంచి, భర్త దివంగతుడైన కారణంగా తన కురులను కత్తిరించుకునే నెపంతో పర్యటనకు అనుమతి కోరింది. ఏ మాత్రం ఆలస్యం లేకుండా బ్రిటిష్ ప్రభుత్వం ఆమె అభ్యర్థనను తిరస్కరించింది. దానితో రాణి "దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతనే నేను నా కేశ సంపదను విసర్జిస్తాను. లేదా అది వల్లకాటిలోనే జరుగుతుంది" అని ఘోరమైన శపథం చేసింది. ఆ విధంగా ఆమె స్వాతంత్ర్య శంఖం పూరించిన మొట్టమొదటి భారత నారి. ఇలాంటి ఎన్నో తిరస్కారాల వల్ల అడుగడుగునా ఆమెలో బ్రిటిష్ ప్రభుత్వం పట్ల అసంతృప్తి, వ్యతిరేకతా; దేశస్వాతంత్ర్యం పట్ల నిరంతరాసక్తీ పెరిగిపోయాయి.

ఈ సమయంలోనే బ్రిటిష్ సైన్యంలో ఉన్న హిందూ ముస్లిం సిపాయిలు వేరు వేరు కారణాలవల్ల తిరుగుబాటు చేశారు. హిందువులకు బొట్టుపెట్టుకోనివ్వకపోవడం కారణమైతే, ముస్లిములకు పందికొవ్వు పూసిన తుపాకి గుండ్లను కొరికి ఉపయోగించ వలసి రావడం కారణం. ఈ రెండు చర్యలవల్లా తదితర కారణాలవల్లా మీరట్‌లో సిపాయిల తిరుగుబాటు చెలరేగింది. మీరట్, ఢిల్లీ ప్రాంతాల భారతీయ సైనికులు ఏకమై బ్రిటిష్ ప్రభుత్వం నుండి ఢిల్లీ సింహాసనాన్ని చేజిక్కించుకొని బహదూర్‌షాను భారత చక్రవర్తిగా ప్రకటించడం జరిగింది. దేశ ఆర్థిక, రాజకీయ రంగాలనే కాక, హైందవ మతాన్ని కూడా తమ గుప్పిటిలో బిగించి కేవలం క్రైస్తవ మతాన్నే దేశమంతటా ప్రచలింప చేయాలనే బ్రిటిష్ మనస్తత్వం ఈ తిరుగుబాటుకు ముఖ్యకారణం. ఈ

తిరుగుబాటులో కేవలం సిపాయిలే కాదు వారి వెనుక భారత రాజులు, సర్దారులు, పీష్వాలు, నవాబులు, హిందువులు, ముస్లింలు, మౌల్వీలు, పురోహితులవంటి వారెందరో ఉన్నారు.

ఈ నేపథ్యంలో రాణి బ్రిటిష్ వారితో కొనసాగించిన యుద్ధం అనేక మలుపులు తిరిగింది. ఓడిపోయిన బ్రిటిష్ వారిపై, వారి కుటుంబ సభ్యులపై ఆమె చూపిన దయ; అపరకాళికలాంటి ఆమె సమర విజృంభణ వంటి గుణాలకు నిలువుటద్దం పట్టింది.

మొదటినుండీ జీవితంలో కష్టాలే అనుభవిస్తూ వచ్చిన రాణీ ఝాన్సీ లక్ష్మీబాయి చివరికి తన చేతిలోనే ఎన్నో సార్లు ఓడిపోయి తోకముడిచి, శరణన్న సర్‌రోజ్ అనే బ్రిటిష్ సేనానితో జరిగిన యుద్ధంలో అత్యద్భుత పరాక్రమం ప్రదర్శించి నేల రాలిపోయింది. దేశ స్వాతంత్ర్యంకోసం జీవితాన్ని పణంగా పెట్టిన రాణిగురించి ఆమెను ఓడించిన సర్ రోజ్ అన్న మాటలు "విప్లవ కారులందరిలో అత్యంత సాహసోపేతురాలు, అందరికంటే గొప్ప సైన్యాధ్యక్షురాలు రాణీ లక్ష్మీబాయి".

చూశారా బాలలూ ! జీవితంలో ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా, ఎన్నో దుఃఖ సముద్రాలు హోరెత్తి ముంచేసినా, కర్తవ్య పరాయణులైన దేశభక్తులు తమ పట్టు విడిచి పెట్టరనడానికి ఝాన్సీలక్ష్మీబాయి ఒక తార్కాణం.





# శ్రీశారదామాత

వ్యక్తిగతంగా సామాజికంగా ఆధ్యాత్మికంగా మానవుల అభ్యున్నతిని నిర్దేశించి జీవనరీతినీ ప్రబోధాన్నీ కొనసాగించిన దివ్యమూర్తి శ్రీశారదామాత, కూతురిగా, భార్యగా, తల్లిగా, గురువుగా, ఆదర్శమూర్తిగా తనకు తానే సాటిగా – పవిత్ర ఆధ్యాత్మిక క్షేత్రంగా పరిఢవిల్లిన భారతదేశంలో వెలుగొందిన నారీమణి శ్రీ శారదామాత.

ఈమె ప్రబోధాలు అత్యంత సరళంగా, సుబోధంగా, ఆచరణకు అత్యంత సులభ సాధ్యమైన మార్గాలుగా లోకాన్ని తరింపజేస్తాయి. ఆపన్నుల సేద దీరుస్తాయి.

**నీకు మనశ్శాంతి కావాలంటే**
**నీ తప్పులు నీవు తెలుసుకో**
**ఇతరుల తప్పులు వెదుకకు**
**సర్వప్రపంచాన్ని నీదిగా చేసుకోవటానికి ప్రయత్నించు**
**ఈ లోకంలోని అందరూ నీవారే !**
**ఎవ్వరూ పరాయివారు కారు.**



ఇది శ్రీ శారదామాత బోధ చూశారా బాలలూ ! ఎంత తేలికగా ఉందో? ఎంత సూటిగా వ్యక్తిత్వ సంస్కరణకు దారి తీస్తుందో?

ప్రముఖ భారతీయతత్త్వవేత్త, తపస్సిద్ధుడు శ్రీరామకృష్ణ పరమహంస ధర్మపత్ని శ్రీ శారదాదేవి. గార్గి, మైత్రేయి

వంటి ప్రాచీన విజ్ఞాన ఖనులైన స్త్రీ మూర్తులను మించి ధర్మప్రబోధం చెయ్యడానికీ, భవతారణమార్గం చూపడానికీ భువిపై అవతరించిన దేవత శ్రీ శారదమాత - అని వివేకానందుని అభిప్రాయం. యోగదీక్షలో శ్రీరామకృష్ణ పరమహంస నెలల తరబడి సమాధిగతుడై ఉన్నప్పుడు సగం తెరిచిన ఆయన నోటిలో అన్నం కుక్కి ప్రాణాలు కాపాడిన తల్లి ఆమె. ఆశ్రమ నిర్వహణలో అనుయాయుల ఆలనపాలనలో ఆయన ఏదైనా త్వరపడితే, ఎవరినైనా ఏమైనా అంటే - దాన్ని సవరించి, అవసరమైతే పరమహంసకు నచ్చజెప్పి అందరూ హాయిగా ఉండే వాతావరణాన్ని సమకూర్చిన కరుణామూర్తి. అలా అని కేవలం దయామూర్తికాదు శ్రీ శారద. క్రమశిక్షణ పక్షంలో సిద్ధాంతాల విషయంలో వజ్ర సదృశ హృదయ. అలాంటి మాత జీవన రీతిని ఆధారంగా చేసుకొని భారత స్త్రీ సముద్ధరణం జరగాలని స్వామి వివేకానంద కోరుకున్నాడు.

ప్రపంచంలోని ప్రతిమనిషీ భౌతికంగా, బౌద్ధికంగా, ఆధ్యాత్మికంగా ఎదగాలి. అప్పుడే అది పరిపూర్ణమైన అభ్యుదయం. సాంప్రదాయక విజ్ఞానం, ఆధునిక వైజ్ఞానిక దృక్పథం ఈ రెండూ రెండుకళ్లలాగా సమన్వయంతో మనిషికి దారి చూపించాలని మాత అభిప్రాయం. ఛాందసం ఆమె మతం కాదు. అత్యద్భుతమైన భారతీయ మూల్యాలపట్ల అజ్ఞానం, పాశ్చాత్య సంస్కృతి ఆకర్షణ నేటిమనిషిని చీకట్లోకి నడిపిస్తున్నాయని ఆమె భావన. ప్రతి పసిపాపకూ తల్లి ఒడే మొదటి బడి కాబట్టి స్త్రీమూర్తులందరూ ఈ ప్రమాదకరమైన అంశాన్ని పసికట్టి నిర్మాణాత్మకమైన భావాలూ తమ పిల్లల భవిష్యత్తూ పెంపొందించుకొని తద్వారా దేశ భవిష్యత్తునూ దిద్దితీర్చే బాధ్యతవహించి, ధర్మబద్ధంగా జీవించడం నేర్చుకోవాలని ఆమె ప్రబోధించింది. మనోవాక్కాయకర్మల పవిత్రత దానికి ఒక మార్గంగా సూచించింది. అందుకే "విద్యావంతులు, పవిత్రజీవనులైన తల్లులు ఉన్న ఇంటనే మహనీయులు జన్మించడం జరుగుతుంద"ని శ్రీ వివేకానంద పేర్కొన్నాడు. ఇది శ్రీ శారద విశ్వాసానికి ప్రతిరూపమే!

శ్రీ శారదామాతవంటి మహనీయచరిత కథలో జీవిత విశేషాలు, సంఘటనలు అంత ముఖ్యమైనవి కావు; ఆమె జీవనరీతి, ఆమె చేసిన బోధ ఆమె ఆశయాలు, ఆమె గుణగణాలకే ప్రాముఖ్యం. ఎందుకంటే, వాటివల్లనే అనుయాయులు, ఎదుటివారు ప్రభావితులౌతారు - ఆ మార్గంలో నడిస్తే జన్మ సార్థక్యం పొందుతారు. అందుకని ఆమె మనోభావాలు, వ్యవహారశైలి తెలుసుకోవడం ప్రధానం.



కుల మత వర్ణ వర్గ విభేద రహితంగా అందరినీ తల్లిలా ప్రేమించే మాతృమూర్తి ఆమె. స్త్రీ విద్యనూ నారీజనాభ్యుదయాన్నీ లక్షించిన అభ్యుదయ భావాలు కలది. కేవలం ప్రేమే మనుషులందరినీ, లోకాన్నీ జయిస్తుందని ప్రబోధించింది. కరుణరూపు దాల్చిన దివ్యజనని శ్రీ శారద. త్యాగానికి ప్రాధాన్యం ఇచ్చేది ఆమె. క్షమ, సంతృప్తి, పరిశుద్ధ చిత్తం, పవిత్రత, వినయం సేవారూపంలో పరతత్త్వ సాధన, భగవంతుని మీద దృఢ విశ్వాసం శ్రీ శారదామాతకు పుట్టుసుగుణాలు. ఒకసారి శ్రీ శారద ఊరు జయరాం.... చుట్టుపక్కల అతిఘోరమైన కరువు వచ్చింది. ఉదారుడైన ఆమె తండ్రి ఒకరోజు అందరికీ భోజనం పెట్టించాడు. ఆకలి ఆవురావురుమంటున్న జనం ఆ వేడివేడి అన్నం తినలేక పోతుంటే పదకొండేళ్ళ శారదామాత విసనకర్రతో భోక్తలకు విసిరింది. ఇలాంటిది ఆమె సేవా గుణం. ఆమె తల్లి శ్యామ సుందరీదేవి జన్మ జన్మలకూ శ్రీ శారదే తన కూతురుగా జన్మించాలని కోరుకునేది. పరమ యోగీశ్వరేశ్వరుడు శ్రీరామకృష్ణ పరమహంస ఆమెను సాక్షాత్తూ జగజ్జనని, ఆదిపరాశక్తి కాళికగా భావించి పూజాపీఠం మీద కూర్చోబెట్టి, ఆమెకు సంప్రదాయబద్ధమైన "షోడశీపూజ" చేశారు. భారతదేశం గర్వించదగిన ఉత్తమ అనుష్ఠాన వేదాంతి శ్రీ వివేకానందుడు ఆమెను పవిత్ర మూర్తిగా వేనోళ్ల కీర్తించాడు.

చూశారా బాలలూ ! పవిత్రత, ఉత్తమ గుణ సంపూర్ణత కలిగిన భారత స్త్రీ ఎంత ఎత్తులకు ఎదిగిపోగలదో ! ఎంతటి ప్రభావాన్ని సమాజం మీద చూపించగలదో!



# జిజియాబాయి, పుత్లీబాయి

తమ సంతానాన్నే కాక, దేశ స్వరూపాన్నీ స్వాతంత్ర్యాన్నీ తీర్చిదిద్దడానికి జీవితమంతా పరిశ్రమించిన మాతృమూర్తులు జిజియాబాయి, పుత్లీబాయి. ఒకరు మహారాష్ట్ర వజ్రమైతే మరొకరు గుజరాతీ మాణిక్యం.

జీవనక్రమంలో నిరంతరం తగులుతూ వచ్చిన ఎదురుదెబ్బలనూ మర్మాఘాతాలనూ వజ్రకఠోర సంకల్పంతో ఎదుర్కొని, భారతజాతి ఔన్నత్యాన్ని హైందవ సంప్రదాయ వైశిష్ట్యాన్ని నిలుపడానికి అహర్నిశలూ కృషిచేసే శివాజీ వీరసింహాన్ని సుశిక్షితం చేసి జాతికి అర్పించిన వీరపత్ని, వీరమాత జిజియా బాయి. సకల సద్గుణాలతో గాంధీజీని తీర్చిదిద్ది , ముఖ్యంగా సత్యసంధతను ఆయనలో ప్రబుద్ధం చేసి, దేశభక్తిని నూరిపోసి, దేశానికి స్వాతంత్ర్యం తెచ్చిన 'జాతిపిత'గా తన గారాబు తనయుని అవతరింపజేసిన పూజ్యమాతాశ్రీ పుత్లీబాయి. ఇద్దరు తల్లులూ తమ






పిల్లలకు భారతజాతి మహాత్మ్యాన్నీ, సంస్కృతినీ భారతీయులైన రాముడు, కృష్ణుడు, సత్యహరిశ్చంద్రుడు వంటి మహాపురుషుల జీవన రీతులనూ ఉగ్గుపాలలో రంగరించి పోసిన వారే! దైవభక్తినీ ఆత్మశక్తినీ తమ సంతానంలో పెంపొందించిన వారే! అందుకే శివాజీ, గాంధీజీ అంతటి మహాత్ములుగా రూపొందారు. కాబట్టే ప్రతి మనిషికీ తల్లే మొదటి గురువు. ఆమె తలుచుకుంటే తన సంతానాన్ని ఎంత గొప్పవారిగానైనా తయారుచేయగలదు. 'మాతృదేవోభవ' అని వేదోక్తి తల్లికే మొదటి నమస్కారం సమర్పించిందీ అందుకే.

మహారాష్ట్ర వీరవనిత, వీరపత్ని, వీరమాత జిజియాబాయి సింద్‌ఖేడ్ గ్రామంలోని మరాఠా సర్దార్ లఖూజీ జాదవ్‌రావ్‌కూ మహల్యాబాయికీ జన్మించింది. ఆమె భర్త షహాజీ గొప్ప వీరుడు. కాని ఆమె తండ్రి మొగలాయీలకూ, భర్త నిజాం ప్రభువుకూ సామంతులు. మొదటి నుండీ ఈ పరదాస్యం జిజియాబాయికి నచ్చేది కాదు. పరాయిపాలనలో దేశీయులపై జరిగే దౌర్జన్యాలూ, బానిసత్వపు బ్రతుకూ ఆమెకుఎంతోకష్టం కలిగించేవి. మనజాతి దాస్యశృంఖలాల నుండి ఎలా విముక్తం ఔతుందా అని ఆమె అనుక్షణం ఆలోచించేది. భరతజాతి మతవిశ్వాస సంస్కృతి సంప్రదాయాలకు ఎప్పుడు రక్షణ ఏర్పడుతుందా అని తహతహలాడేది. ఆమె నిరంతర తపన, ఆలోచనల ఫలితమే స్వాతంత్ర్య భావ పరిపూర్ణమైన , హైందవమత సంప్రదాయ పరిరక్షణకు నడుం కట్టిన వీరశివాజీ మూర్తి.

తండ్రి షహాజీ పరాయి పాలనకు తన జీవితమంతా ఎత్తుకట్టినా, తనయుడు శివాజీ మాత్రం తల్లి ఆలోచనలకూ ఆశయాలకూ ఆలవాలమైన మాతృవత్సలుడు. ఆమె ప్రబోధాలను ఆచరణలో మూర్తి కట్టించిన శౌర్యప్రతాపవంతుడు. పరదేశీయులు పడగొట్టించిన హైందవ దేవాలయాలనూ, పాడుపెట్టిన సంసారాలనూ, సంప్రదాయాలనూ పునరుద్ధరించిన సమాజసేవకుడు, స్త్రీల రక్షణకూ, పాలితుల ధనరక్షణకూ ఉక్కు కోటగా నిలిచిన ఉగ్రమూర్తి. తన నైపుణ్యంతో అఫ్జల్‌ఖాన్ వంటి ఏడడుగుల రాక్షసుడిని చీల్చివైచి తన బల పరాక్రమచాతుర్యాలతో నిరంకుశ మొగలాయీ చక్రవర్తి ఔరంగజేబు అంతటివాడిని గడగడ లాడించిన మహాయోధుడు. ఎంతకూ చిక్కక ఔరంగజేబుతో కొండ ఎలుక అని బిరుదు పొందిన మింగుడుపడని రాయి.

తన పదహారవయేటనే శివాజీ తోరణ్‌గఢ్ ఆక్రమించుకొని తల్లి కన్నుల పండుగగా పట్టాభిషిక్తుడైనాడు. ఆ తర్వాత క్రమక్రమంగా మొగలాయి పాలనలోని సింహగఢ్, రాయగఢ్ వంటి దుర్భేద్యమైన కోటలను ఆక్రమించి రాయగఢ్‌లో ఛత్రపతిగా సింహాసనాసీనుడైనాడు.

ఆయన తల్లికి చెప్పకుండా ఏ పనీ చేసేవాడు కాదు. ఏ నిర్ణయమూ తీసుకునే వాడుకాదు. చిన్నతనం నుండే గోహత్య చేసేవాళ్ల చేతులు నరికేయమనీ, స్త్రీలను పాడు చేసేవారికి మరణదండన విధించమనీ ప్రబోధిస్తుండే వాడు. ఆత్మాభిమానం, సంస్కృతీ సంప్రదాయాల పరిరక్షణ, దేశస్వాతంత్ర్యానికి పోరాటం వంటి అంశాలను ప్రాణప్రదంగా పరిరక్షించుకునే వాడు. ఇవన్నీ ఆయనకు తల్లి శిక్షణలో లభించినవే. తల్లి చెప్పిన రాముడు, భీముడు, అర్జునుడువంటి వీరయోధుల కథల ప్రభావమే! తుల్జాభవాని ప్రత్యక్షమై స్వయంగా శివాజీకి ధర్మఖడ్గం అందించిందని ప్రతీతి.

"ఓ ఆదిపరాశక్తీ! స్వంత సైన్యాలతో, తనదైన పతాకంతో దేదీప్యమానంగా ప్రకాశించే ఒక స్వయం సత్తాక రాజ్యం నేను చూడాలనుకుంటున్నాను. ఈ వరం ప్రసాదించు" అని ప్రతినిత్యం జిజియాబాయి తుల్జాభవానికి చేసిన ప్రార్థనల ప్రతిరూపమే తల్లి పూనిక నెరవేర్చిన వీర శివాజీ.

ఇక గుజరాత్ రాష్ట్రంలోని పోర్‌బందర్‌కు చెందిన గాంధీజీ తల్లి పుత్లీబాయి విషయానికి వస్తే - ఈమె కూడా మోహన్‌దాస్ కరంచంద్ గాంధీకి చిన్నతనం నుండీ రామాయణ భారతగాథలనూ, భారతీయ సంస్కృతీ సంప్రదాయాలనూ నూరిపోసింది. స్వతంత్రభావాలను ప్రబోధించింది. ఆమె మార్గదర్శనంలోనే గాంధీజీ ఇంతటి వాడయ్యాడు. చిన్నతనంలో తల్లి వెంట సత్యహరిశ్చంద్ర నాటకం చూడడానికి వెళ్లాడు గాంధీ. అందులో ఆ మహాచక్రవర్తి పడినపాట్లు చూసి, అలా ఎందుకు జరిగిందని తల్లిని అడిగాడు గాంధీ. సత్యం చెప్పడంలో ఉన్న గొప్పతనాన్నీ, సత్యఫలాన్నీ, ఎల్లప్పుడూ సత్యం పలికేవాళ్లను లోకం గౌరవించే తీరునూ చిన్నగాంధీకి చక్కగా బోధించింది పుత్లీబాయి. దానితో గాంధీ జీవితంలో ఎప్పుడూ సత్యమే మాట్లాడుతానని తల్లికి మాట ఇచ్చి, అక్షరాలా నిలుపుకున్నాడు. స్వాతంత్ర్య సమరంలో తాను తెలిపే నిరసనకూ, నిరాహారదీక్షకూ 'సత్యాగ్రహం' అనే పేరు పెట్టాడు. ఆ సత్యాగ్రహ మహాత్మ్యం తోనే తెల్లవారిని ఇండియా పొలిమేరలు దాటించిన జాతిపిత గాంధీజీ.

చూశారా! బాలలూ! తల్లిమాట పాటించే పిల్లలు ఎంత గొప్ప వారౌతారో! జీవితంలో ఎన్ని సాధిస్తారో! ఎంత కీర్తివంతులౌతారో! కాబట్టి ప్రథమగురువైన మాతృమూర్తి శిక్షణ జీవితంలో అభ్యుదయకారకం. తమ కర్తవ్యాన్ని, త్రికరణశుద్ధిగా నెరవేర్చి సంతానం భవిష్యత్తును దిద్దితీర్చిన జిజియాబాయి, పుత్లీబాయి వంటి జనయిత్రులు ధన్యులు.





# శ్రీమతి కందుకూరి రాజ్యలక్ష్మి

ఏ పురుషుని అభ్యున్నతి వెనుకనైనా ఒక స్త్రీ ఉంటుంది అనే లోకోక్తికి ఉదాహరణ- సంఘ సంస్కర్త శ్రీవీరేశలింగంగారి ధర్మపత్ని శ్రీమతి కందుకూరి రాజ్యలక్ష్మిగారు. ఆమె నిజంగా ఆయనకు 'ధర్మపత్ని' - గొప్ప సామాజిక, సంఘసేవా భూమిక.

ఈమె రాజమండ్రికి దగ్గరనున్న 'కాతేరు'లో జన్మించారు. ఆడపిల్లలు చదువు కోవడం ఒక విడ్డూరమైన ఆ రోజుల్లో తన మేనమామ శ్రీ వెన్నేటి వెంకటరత్నము ప్రోత్సాహంతో రాజ్యలక్ష్మిగారు బడికి వెళ్లి చదువుకున్నారు. ఆమె ఎనిమిదవ ఏట శ్రీ వీరేశలింగంగారితో వివాహం జరిగింది. అది వీరేశలింగంగారి అదృష్టమే కాక తెలుగు ఆడపిల్లల అదృష్టంకూడా !



ఈమె చిన్నతనం నుంచీ గొప్ప సాహసవంతురాలు. సంస్కరణాభిలాషకల స్త్రీ. సంఘసంస్కరణోద్యమంలో జీవితమంతా నిష్ఠూరాలు నిందలు, కష్టనష్టాలు భరించింది. వీరేశలింగం గారు చేపట్టిన స్త్రీ విద్య, వితంతు పునర్వివాహం వంటి సంస్కరణలన్నీ ఆమె ఇంటి నుండే ప్రారంభమైనాయి. మొదటి వితంతు వివాహం ఆమె ఆధ్వర్యంలో ఆమె ఇంట్లోనే జరిగింది.

వారు నడిపే బాలవితంతు శరణాలయంలో దూరదూరాలనుండి ఆడపిల్లలు

వచ్చి చేరేవారు. వీరేకాక, పురుషులచేత మోసగింపబడి, గర్భవతులై తిరస్కరింపబడిన అభాగ్య స్త్రీలుకూడా ఈమె పంచన చేరేవారు. తన ఇంటి ఎదురుగా ఇలాంటి స్త్రీలకోసం ప్రత్యేకంగా ఒక శరణాలయం ఏర్పాటుచేసి, వాళ్ల కన్నీళ్లు తుడిచి, వాళ్ల జీవితాలనొక కొలిక్కి తీసుకువచ్చే ప్రయత్నం చేసేవారు. అలాంటి ముగ్గురికి ఆమె ఆదర్శవాదులైన యువకులతో పెళ్లి జరిపించింది. కొందరు అక్కడే ప్రసవించేవారు. అలాంటి స్త్రీల బిడ్డల పొత్తిళ్లు ఉతకమని పనివాళ్లు తిరస్కరిస్తే, ఆమె స్వయంగా ఉతికేది. వితంతు వివాహాలు చేస్తున్నారనే తిరస్కారంతో పనివాళ్లు నీళ్లు తేకపోతే ఆమే గోదావరి నుండి నీళ్లు మోసుకు వచ్చేది. అలా ప్రసవించిన ఒక అమ్మాయి తన బిడ్డను అక్కడే వదిలివేస్తానంటే రాజ్యలక్ష్మిగారు ఆ పసిపాపకు 'ప్రేమావతి' అని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచుకున్నది. అవసరమైతే తానే స్వయంగా పురుళ్లు పోసేది. వితంతు వివాహాల్లో కొట్లాటలు, అల్లర్లు, పెళ్లిని ఆపించే ప్రయత్నాలు ముమ్మరంగా జరిగేవి. ఆమె చేసిన ఒక్కొక్క వితంతు వివాహం ఒక్కో యజ్ఞం. ఐనా ఆమె ఏనాడూ భయపడలేదు, తన ఇంటి మీదే దాడి జరిగినా వెనుదీయలేదు. వితంతువులు ఏ సమయంలో తన ఇంటికి వచ్చినా చేతిలో ఎంతపని ఉన్నా వదిలేసి వచ్చి వారితో ఆప్యాయంగా మాట్లాడి, కావలసిన సదుపాయాలు చేసి ఆదరించేది. చదువురాని వాళ్లకి చదువూ కొందరికి సంగీతమూ స్వయంగా నేర్పించేది. రాజ్యలక్ష్మమ్మగారంటే అలాంటి వారందరికీ కన్నతల్లే ! ఈనాటి స్త్రీ విద్యా సామాజిక రంగాల్లో ఇంత ముందుండడానికి కారణం ఆమె ప్రారంభించిన ఉద్యమమే!

స్త్రీలకోసం ప్రార్థనా సమాజాల్ని స్థాపించి, స్వయంగా కీర్తనలు రచించి అందరికీ నేర్పించేవారు. ఒకసారి ఒక మాల యువకుడు తన ఇంటిముందు వీధిలో స్పృహ తప్పి పడిపోతే, తన ఇంటి అరుగుమీదే పడుకో బెట్టించి ఉపచారాలు చేసి సేద దీర్చిన కరుణమూర్తి రాజ్యలక్ష్మి. కుల మత వర్ణ వర్గ విభేదరహితంగా క్రైస్తవులతోపాటు అన్ని కులాలవారికీ మతాలవారికీ తన ఇంటిలో అప్పుడప్పుడూ సహపంక్తి భోజనాలు ఏర్పాటుచేసేది. సోమరిగా ఊరికే ఉండడం అంటే ఆమెకు అస్సలు గిట్టేదికాదు. ఎప్పుడూ ఏదో ఒక నిర్మాణాత్మక కార్యక్రమం చేపట్టవలసిందే ! స్వగృహంలోనే **శ్రీ విక్టోరియా బాలికా పాఠశాల**ను స్థాపించి, ఉచిత విద్యాదానం చేసింది. ఇలా సంఘసేవలో తన ధనం, ఆస్తి, సమయం అన్నీ భర్త స్థాపించిన "హితకారిణీ



సమాజా"నికి సంతోషంగా సమర్పించిన త్యాగమూర్తి శ్రీమతి కందుకూరి రాజ్యలక్ష్మి. ఆమె చనిపోయిన రోజున అన్ని కులాలకూ మతాలకూ చెందిన ప్రజలు అసంఖ్యాకంగా వచ్చి నివాళులర్పించారంటే, ఆమె పరమత సహనం, భూతదయ, సంఘసేవాదృక్పథం ఎంత గొప్పవో ఊహించుకోవచ్చు.

చూశారా బాలలూ! త్రికరణ శుద్ధిగా సమాజసేవకు అంకితమైన స్త్రీలు దేనికీ జంకరనీ, వెనుదీయరనీ, వెనుకడుగువేయరనీ ఘంటాపథంగా చాటడానికి శ్రీమతి కందుకూరి రాజ్యలక్ష్మిగారే ఒక ప్రబలమైన సాక్ష్యాధారం.



# భారతకోకిల సరోజినీనాయుడు

సుమధుర కవయిత్రి, స్వాతంత్ర్యద్యోమంలో చురుకుగా పాల్గొన్న వీరవనిత, వితరణశీల, **భారతకోకిల** అని పేరు పొందిన సరోజినీనాయుడు.

పుట్టింది బెంగాల్లో ఐనా, మెట్టింది ఆంధ్రదేశాన్ని. హైదరాబాద్‌లో ఉంటూ **నేను తెలంగాణా స్త్రీని. ఆంధ్రదేశానికి చెందినదాన్ని** అని నిస్సంకోచంగా ప్రకటించిన ఈమె చేతికి ఎముకలేని దానశీల. నేడు గచ్చిబౌలిలో ప్రముఖంగా వెలసిన హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం, ఆరంభంలో సరోజినీనాయుడు విరాళంగా ఇచ్చిన గోల్డెన్ త్రెషోల్డ్ భవన ఆవరణలోనే కొనసాగింది. స్వాతంత్ర్యోద్యమంలో గాంధీ వెన్నంటి నడిచిన ఈమె ఆ తర్వాత స్వతంత్రభారతంలో ఉత్తరప్రదేశ్ గవర్నర్ పదవినీ నిర్వహించింది. మనదేశంలో అలాంటి ఉన్నత పదవిని నిర్వహించిన ప్రప్రథమ మహిళ ఆమె!



ఆమె తండ్రి అఘోరనాథ చటోపాధ్యాయ గొప్ప విద్యావేత్త. ఆనాటి నిజాం ప్రభువు ఆయనను వంగదేశం నుండి పిలిపించి హైదరాబాద్ నిజాం కళాశాల స్థాపనకు ప్రముఖ పాత్ర వహించవలసిందని కోరాడు. కళాశాల స్థాపనతో పాటు సరోజిని తండ్రి తన ఉద్యోగ విరమణ వరకూ నిజాం కళాశాలలోనే ఆచార్యులుగా పని చేశారు. ఆమె తల్లి వరదసుందరీదేవి.



సరోజినీదేవి తన 12వ ఏటనే మెట్రిక్యులేషన్ పాసయ్యింది. ఏకధాటిగా అప్పుడే 2000 పంక్తుల కవిత రాసింది. ఆమె తెలివితేటలకు మెచ్చిన నిజాం ఆకాలంలో ఏడాదికి 4500 రూపాయల స్కాలర్‌షిప్పు మీద ఉన్నత విద్యాభ్యాసానికి ఇంగ్లండు పంపించాడు. లండన్‌కింగ్స్ కాలేజీలో, కేంబ్రిడ్జ్‌లోని గర్టన్ కళాశాలలోనూ ఆమె విద్యాభ్యాసం చేసింది. బ్రాహ్మణుల అమ్మాయి ఐన సరోజిని తన పదహారవ ఏట హైదరాబాద్‌లోని చీఫ్ మెడికల్ ఆఫీసర్ ముత్యాల గోవిందరాజులు నాయుడిని ప్రేమించి వివాహం చేసుకుంది. అందుకే ఆమెను **ముత్యాలకోకిల** అని కూడా అంటారు. వీరిద్దరి వర్ణాంతరవివాహాన్ని జరిపించింది సంఘసంస్కర్త వీరేశలింగం పంతులుగారు.

క్రీ.శ.1905లో గాంధీజీ పిలుపుతో స్వాతంత్ర్యోద్యమంలో చేరడంతో ఆమె జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభమైంది. అప్పటినుండీ దేశ స్వాతంత్ర్యోద్యమ, రాజకీయ చరిత్ర ఆమె చరిత్రగా మారిపోయింది. కాన్పూరులో జరిగిన కాంగ్రెస్ మహాసభ (1925)కు ఆమె అధ్యక్షస్థానం వహించింది. ఒక మహిళ కాంగ్రెస్ అధ్యక్షురాలు కావడం కూడా అదే ప్రథమం. చతురోక్తులతో జనాన్ని ఆకట్టుకోగల మంచి ఉపన్యాసకురాలు ఆమె. కేవలం ఆమె ఉపన్యాసం వినడానికే కొన్నిసార్లు జనం కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యేవారు. ఉప్పు సత్యాగ్రహ సమరంలో దండియాత్రకు గర్జించిన ఆడసింహం ఆమె. గాంధీ నెహ్రూలు అరెస్టైన తర్వాత కూడా ఆమె ఉప్పు కొఠారులమీద ముట్టడి కొనసాగించింది. సత్యాగ్రహుల బృందాన్ని ఆపడానికి విధిలేక బ్రిటిష్ పోలీసులు ఆమెను అరెస్ట్ చెయ్యవలసి వచ్చింది. తన అనారోగ్యాన్ని కూడా లెక్కించక ఆమె క్విట్ ఇండియా ఉద్యమంలోనూ క్రియాశీలపాత్ర నిర్వహించింది. The Golden Threshold (బంగారు గడప), The poems of life and death (జీవన్మరణగీతాలు), The bird of Time ( కాలవిహంగం), The broken wing (తెగిన రెక్క) అనేవి ఆమె ఆంగ్లంలో రచించిన నాలుగు కవితా సంపుటాలు. అందులో ఆమె కేంద్ర విశ్వవిద్యాలయాలకి దానంగా ఇచ్చిన ఆమె ఇంటి పేరే ఉన్న Golden Threshold ఎన్నో పునర్ముద్రణలు పొందింది. తియ్యగా కవితాగానం చేసేది సరోజిని. అందువల్ల సార్థకంగా ఆమెకు **The Nightingale of the East** అన్న చెరగని ఖ్యాతి లభించింది. జెనీవాలో జరిగిన ఒక అంతర్జాతీయ

మహిళా సభలో ఆమె అందరూ ముగ్ధులైపోయే మధురమైన గొప్ప ఉపన్యాసం చేసి భారత నారీమణుల గొప్పదనం మరింత పెంచింది. ఆ తర్వాతదేశంలో ఎక్కడ గొప్ప సభలు జరిగినా ఆమెను తప్పక ఉపన్యాసానికి ఆహ్వానించేవారు. ఆమె కాలంలోనే కాంగ్రెస్‌లో విభిన్నవర్గాలున్నా, ఎందులోనూ చేరక తటస్థంగా సరోజిని దేశ స్వాతంత్ర్యానికై అహర్నిశలూ కృషి చేసింది. అంతగొప్ప దేశప్రేమ, జాతీయాభిమానం ఉన్న వీరవనిత, సమాజసేవకురాలు, మధుర కవయిత్రి సరోజినీనాయుడు.

చూశారా బాలలూ! నిస్వార్థంగా చిత్తశుద్ధితో సారస్వతానికీ దేశానికీ సేవ చేయాలనుకునే వనితలు ఎంత గొప్పవారవుతారో! అందుకు ప్రత్యక్ష నిదర్శనం శ్రీమతి సరోజినీ నాయుడు.





# దుర్గాబాయి దేశ్‌ముఖ్

సేవాభావం మనుషులను మహనీయులుగా మార్చే పరుసవేది. దీనికి తార్కాణం శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్.

సంఘసేవకురాలిగా, రచయిత్రిగా, వక్తగా, సంఘసంస్కర్తగా, స్వాతంత్ర్య సమరయోధురాలుగా, దేశభక్తురాలుగా, బహుముఖ ప్రజ్ఞావంతురాలుగా జీవితంలో రూపొందిన ఈమెలో బాల్యం నుండీ ఉన్న సహజ లక్షణం సేవాతత్పరత. చేతనైనంత ఎక్కువగా ఇతరులకు సహాయపడాలనే తహతహ. శ్రీమతి కృష్ణవేణమ్మ, శ్రీ రామారావు దంపతులకు 1909లో పవిత్ర గోదావరీ తీరమైన రాజమహేంద్రవరంలో జన్మించిన ఈమె తన పదమూడేళ్ళ పసిప్రాయంలోనే కాకినాడలో "బాలికా హిందీ పాఠశాల" పేరుతో ఒక పాఠశాలను నిర్వహించింది. ఇందులో 30, 40 సంవత్సరాల మధ్యవయస్కులైన స్త్రీలు కూడా విద్యార్థినులుగా ఉండేవారట.



అతి చిన్న వయసులోనే గాంధీజీ ప్రభావం దుర్గాబాయి మీద పడింది. బాలికగా ఉన్నప్పుడే ఆమె తన బంగారు గాజులను జాతీయోద్యమానికి ధారపోసింది. విదేశీ వస్త్ర బహిష్కరణం చేసి, వాటిని నడి వీధిలో తగులబెట్టి జీవిత మంతా ఖద్దరు మాత్రమే ధరించింది. ఎన్నోసార్లు గాంధీగారు ఆంధ్రదేశం వచ్చినప్పుడు ఆయన హిందీ ప్రసంగాలను అనేక బహిరంగ సభల్లో తెలుగులోకి అనువాదం చేసింది. మౌలికంగా ఆమెలో ఉన్న సేవాభావమే ఆమెను భారత

జాతీయుల అష్టకష్టాల దాస్యం నివారించే గొప్ప దేశభక్తురాలిగా మార్చింది.

1930లో దుర్గాబాయి ఉప్పు సత్యాగ్రహానికి నాయకత్వం వహించింది. అప్పుడు జరిగిన లాఠీ ఛార్జిలో తీవ్రంగా గాయపడి, రక్తం ధారలుగా కారుతున్నా పిడికిట పట్టిన ఉప్పు విడువని ఆమెను బ్రిటిష్ గవర్నర్ లార్డ్ కానింగ్ 'ఆడసింహం'గా అభివర్ణించాడు. ఈ సందర్భంగా మూడుసార్లు అరెస్టయి జైలుకెళ్ళింది. ఆ రోజుల్లో గొప్ప గొప్ప కాంగ్రెసు నాయకులు సైతం 'ఎ'క్లాస్ జైలు కోరుకుంటుండగా దుర్గాబాయి మాత్రం 'సి' క్లాస్ జైల్లోనే తన శిక్ష అనుభవించింది.

సంఘసంస్కర్తగా ఈమె ఎన్నో విజయాలు సాధించి స్త్రీ లోకానికి ఎనలేని సేవ చేసింది. కందుకూరి వీరేశలింగం పంతులు, రఘుపతి వేంకటరత్నం నాయుడు వంటి మహనీయుల ఉద్బోధతో ఆమె బాల్య వివాహాలు, వితంతువులకు ఎదురౌతున్న నిరాదరణ వంటి సాంఘిక దురాచారాలను తీవ్రంగా ఎదిరించింది. స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఆరోజుల్లోనే ప్రబోధించిన విజ్ఞురాలు ఆమె.

గాంధీగారి పిలుపు మేరకు ఆమె చిన్నతనంలోనే ఆంగ్ల విద్యాభ్యాసం మానుకున్నా, తిరిగి తన 24వ ఏట ప్రారంభించి బెనారస్ హిందూ యూనివర్శిటీ నుండి ప్రైవేట్‌గా మెట్రిక్ పాసై, ఆంధ్ర విశ్వ విద్యాలయం నుండి బి.ఏ. ఆనర్స్ మొదటి శ్రేణిలో ఉత్తీర్ణురాలై ఆ తర్వాత 'లా' డిగ్రీ కూడా పొందింది. అందువల్ల ఆమెది "ఉడుము పట్టు" అని చెప్పవచ్చు.

ఉత్తను క్రిమినల్ లాయర్‌గా స్థిరపడిన దుర్గాబాయమ్మ గారిని రాజ్యసభ సభ్యత్వానికి ఆహ్వానిస్తూ ఢిల్లీ నుండి పిలుపు వచ్చింది. "హిందూ కోడ్ బిల్" తయారు చేయడంలో ఈమె ఎంతో ప్రముఖ పాత్ర వహించింది.

దేశ ప్రణాళికా సంఘ సభ్యురాలిగా, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు అధ్యక్షురాలిగా పనిచేస్తున్న కాలంలో దుర్గాబాయి ఆనాటి ఆర్థిక మంత్రి శ్రీ సి.డి. దేశ్‌ముఖ్ గారిని వివాహమాడింది. సి.యస్. డబ్ల్యు.బి. అధ్యక్షురాలుగా దేశవ్యాప్తంగా పర్యటించి గ్రామీణ స్త్రీ శిశు సంక్షేమ కార్యక్రమాల సత్వర అమలుకు కృషి చేసింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్‌తో పాటు ఎంతో ప్రతిష్ఠాత్మకమైన "పద్మభూషణ్, నెహ్రూ లిటరసీ అవార్డు, యునెస్కో ప్రపంచ శాంతి బహుమతి" వంటి వాటిని ఈమె కైవసం చేసుకుంది.

"ఆంధ్ర మహిళ" అనే పేరుతో తెలుగులో ఒక పత్రిక ప్రారంభించి, తర్వాత దానినే "విజయదుర్గ" అనే పేరుతో ఆంగ్లంలోనూ తెలుగులోనూ ప్రచురించింది. "ద స్టోన్ దట్ స్పీక్స్" అనే పుస్తకంలో 58 సంవత్సరాల ఆంధ్ర మహిళా సభ ఆవిర్భావ వికాసాలను పొందుపరిచింది. జైల్లో 'లక్ష్మి' అనే నవల రాసింది. 'శారద', 'భారతి', 'గృహలక్ష్మి', 'ఆంధ్ర మహిళ' పత్రికల్లో అనేక వ్యాసాలు ప్రచురించింది. "చింతామణి మరియు నేను" అనే పేరుతో ఆత్మకథ రచించింది. "భారతదేశంలో సాంఘిక సంక్షేమం" అనే ఈమె గ్రంథం ఎంతో అమూల్యమైనది.

శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ స్థాపించిన సేవా సాంఘిక సంక్షేమ సంస్థలు అనేకాలు. ఆంధ్రప్రదేశ్‌లోనూ మద్రాసులోనూ వెలసిన ఆంధ్రమహిళా సభ సేవా కేంద్రాలు – "ఆంధ్ర మహిళాసభ" అంటేనే దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ అనే ప్రఖ్యాతిని ఈమెకు సంతరించి పెట్టాయి. స్త్రీ వయోజన విద్యకు ఈమె కృషి ఎంతో దోహదం చేసింది. ఒక్క హైదరాబాద్‌లోనే ఈమె 27 భవనాలను ప్రారంభించిందంటే ఆమె సేవాభావం ఎంత గొప్పదో ఊహించవచ్చు. ఆంధ్ర మహిళా సభ నర్సుల హాస్టల్, ప్రసూతి ఆస్పత్రి, కుటుంబ నియంత్రణ కేంద్రం, శిశు విహార్, గాంధీ శతాబ్ది భవన్, మహిళా విద్యాలయ, ఆర్ట్స్ & సైన్స్ కాలేజ్, సమగ్ర విద్యా కళాశాల, గాంధీ సెంటినరీ హాల్, సాహిత్య నిలయం, మహిళా తపాలా కార్యాలయం, గ్లాక్సో భవన్, సి.డి. దేశ్‌ముఖ్ కార్డియో వాస్క్యులర్ సేవాకేంద్రం, కరోనరీ కేర్ యూనిట్, లిటరసీహౌస్ వంటివి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారికి చెరగని చిర కీర్తిని ఆర్జించి పెట్టాయి.

చూశారా బాలలూ! కేవలం ఒక్క సేవాభావం అనే గుణంతో దుర్గాబాయ్‌గారు ఎన్ని ఘన విజయాలు సాధించారో? మీరందరూ కూడా ఇలాంటి ఉత్తమ గుణాలనూ, ఉన్నత లక్షణాలనూ సంతరించుకొని జీవితాల్లో ఎంతో ఎదిగిపోవాలి. జాతికి ఎనలేని సేవలు చేసి జన్మలు సార్థకం చేసుకోవాలి.



# భారతరత్న ఎం.ఎస్. సుబ్బులక్ష్మి

సుమధుర శ్రావ్య ధ్వనితో "శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం" విన్నా "విష్ణు సహస్రనామం" కావాలన్నా తక్షణమే గుర్తుకు వచ్చేది శ్రీమతి ఎం ఎస్ సుబ్బులక్ష్మి. అమృత వర్షంలాంటి గళానికీ, ధారాపాతమైన మధుర కర్నాటక గాత్రానికీ ఈమె పెట్టింది పేరు. దక్షిణ భారతదేశంలో అవతరించిన సాహిత్య శారద మొల్ల ఐతే – సంగీత విశారద సుబ్బులక్ష్మి.

మదురై షణ్ముఖ వాదివు సుబ్బులక్ష్మి అనే పేరున్న ఈమె ఎం ఎస్ సుబ్బులక్ష్మిగా, ఎం ఎస్ (ఎం ఎస్ ఎస్) గా సంగీత ప్రియులందరికీ సుపరిచితురాలు. కల్కి సదాశివం ఈమె భర్త. ఆయన ఒక స్వాతంత్ర్య సమరయోధుడు, రాజాజీ అనుయాయి.



పుట్టిన ఊరు చెన్నైలోని మదురై. ఈమె తండ్రి సుబ్రహ్మణ్య అయ్యర్ ఒక న్యాయవాది. ఈమె ముద్దుపేరు **కుంజమ్మ.**

తన 16వ ఏటనే ఈమె మొదటి సంగీత కచేరీ అద్భుతంగా చేసింది. కర్నాటక సంగీతంతో పాటు హిందుస్తానీలో కూడా ప్రవీణురాలు. కర్నాటక సంగీతానికి సెమ్మనగుడి శ్రీనివాస అయ్యర్, హిందుస్తానీకి పండిట్ నారాయణరావ్ వ్యాస్ ఈమె గురువులు. పురుషులే కర్నాటక సంగీత విద్వాంసులుగా ప్రముఖంగా ఉన్న ఆ రోజుల్లో, చరిత్రగతిని మార్చివేసి తన 17వ ఏటినుండే మద్రాస్ మ్యూజిక్ ఎకాడమీ ద్వారా అనేక కచేరీలు చేసింది. తమిళం, తెలుగు, సంస్కృతం, హిందీ, మళయాళం,కన్నడం, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ వంటి ఎన్నో భారతీయ భాషల్లో ఎన్నో విధాల ప్రక్రియల్లో అనిదంపూర్వమైన సంగీత సభలు చేసింది. భారత సాంస్కృతిక రాయబారిగా లండన్, న్యూయార్క్, కెనడా వంటి దేశాలు పర్యటించింది.



సుబ్బులక్ష్మి కొన్ని తమిళ చలన చిత్రాల్లోనూ నటించింది. 'సేవాసదనం' ఆమె నటించిన మొదటిసినిమా 'సావిత్రి'లో నారదపాత్రనూ, జాతీయ ప్రాముఖ్యాన్ని సంతరించుకున్న 'మీరా' పాత్రనూ సమర్థవంతంగా పోషించింది. ఈ సినిమా హిందీలో కూడా భాషాంతరీకరణంచెందింది. దిలీప్ కుమార్ రాయ్ సంగీత దర్శకత్వంలో ఆమె పాడిన మీరా భజనలు గొప్ప ఖ్యాతిని తెచ్చి పెట్టాయి. ఆ తర్వాత ఆమె సినిమాలు విడిచిపెట్టి కేవలం సంగీతానికే అంకితమైపోయింది.

"శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, విష్ణు సహస్ర నామం, భజగోవిందం, బాలాజీ పంచరత్నమాల, మీరా భజనలు" ఈమె ప్రధానంగా పాడిన సంగీత సంకలనాలు.

లతామంగేష్కర్ ఆమెను **తపస్విని** అనీ, ఉస్తాద్ బడే గులామ్ అలీఖాన్ **సుస్వరలక్ష్మి** అనీ కీర్తించారు. **సంగీత సామ్రాజ్ఞి** ఐన ఆమె ముందు కేవలం ఒక దేశ ప్రధాని ఐన నేనెంత? అని నెహ్రూ స్వయంగా ప్రస్తుతించాడు.

**సంగీతకళానిధి** వంటి అనేక బిరుదులతో పాటు **పద్మభూషణ్, పద్మ విభూషణ్** పురస్కారాలూ, దేశంలో అత్యున్నతమైన **భారతరత్న** పురస్కృతీ ఆమెను వరించాయి. తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థానగాయని పదవి వరకు ఆమె సంగీతయానం సాగించింది. ఎన్నో విశ్వవిద్యాలయాల గౌరవ డాక్టరేట్లూ, అసంఖ్యాకమైన ఘన ధన సన్మాన పురస్కారాలూ పొందింది. ఆరూపంగా వచ్చిన ధనాన్నంతా సేవాసంస్థలకే ఆమె సమర్పించడం ఆమె దానశీలానికి తార్కాణం.

చూశారా బాలలూ ! త్రికరణశుద్ధిగా కళను నమ్ముకొన్న నారీమణులు ఎంత ప్రఖ్యాతి వహిస్తారో ! అందుకు నిదర్శనం భారతరత్న ఎం. ఎస్.



# భారతరత్న శ్రీమతి ఇందిరాప్రియదర్శినీ గాంధి

ఇందిరాగాంధిగా అందరినోళ్లకూ ఎక్కిన ఈమె ఒక దుర్నిరీక్ష్యమైన రాజకీయశక్తి. అసదృశమైన ప్రతిభాస్ఫూర్తి. నిర్ణయాలకూ సుస్థిర పరిపాలనా విధానాలకూ నెలవైనమూర్తి.

ఈకృతి మొదటికథలోని రుద్రమదేవిని దిద్ది తీర్చిన గణపతి దేవ చక్రవర్తిలాగానే ఇందిరా ప్రియదర్శినిని రూపొందించాడు ఆమె తండ్రి జవహర్లాల్ నెహ్రూ. స్వాతంత్ర్యోద్యమం వల్ల ఆమె చిన్నతనంలో తాను బహుకాలం జైల్లోనే ఉన్నా, తనయకు రాసిన అనేక లేఖలద్వారా ఆమె నడవడికను ఎప్పటికప్పుడు అభ్యుదయ పథానికి మళ్లిస్తూ "లేఖా సాహిత్యం" ఎంతగొప్పదో, ఎంతశక్తిమంతమో నిరూపించాడు. ఇందిర కూడా రుద్రమ్మకు తగ్గే వ్యక్తి ఏ మాత్రం కాదు. చరిత్ర అది నిరూపించింది. ప్రజాస్వామ్య పద్ధతులను ఏ మాత్రమూ అతిక్రమించకుండా దాదాపు పదిహేను సంవత్సరాల సుదీర్ఘకాలం ఎదురులేని ఏకైక ప్రధానిగా, అప్పటికీ ఇప్పటికీ – చండ శాసనం చేసిన పరాశక్తి స్వరూపిణి ఆమె! బహుశా రుద్రమ్మే మళ్ళీ పుట్టిందేమో అన్నట్టు.



స్వాతంత్ర్యోదయం తర్వాత మొదటి భారత ప్రధాని తన తండ్రి నెహ్రూకు అనధికార, ఆంతరంగిక కార్యదర్శిగా వ్యవహరిస్తూ – పరిపాలనారీతులనూ, దేశ పరిస్థితులనూ, ప్రజల మనస్తత్వగతులనూ క్షుణ్ణంగా అవగతం చేసుకున్నది. నెహ్రూ తర్వాత వచ్చిన లాల్ బహుదూర్ శాస్త్రి క్యాబినెట్‌లో మొదటిసారిగా సమాచార ప్రసార శాఖామంత్రిగా అద్వితీయంగా పనిచేసింది. అంతకుముందు రాజ్యసభ సభ్యురాలిగా కూడా ఉన్నది. శాస్త్రిగారి అనంతరం తొలి (ఇంతవరకూ చివరి) మహిళా ప్రధానిగా ఎన్నికై పదిహేను సంవత్సరాలు అప్రతిహతంగా పరిపాలించింది.

మొదటినుంచీ క్రియాశీల రాజకీయ వాతావరణం ఉన్న కుటుంబంలో జన్మించిన కారణంగా ఆక్స్‌ఫర్డ్‌లో ఉన్నత విద్యాభ్యాసం ముగియగానే ఇండియాకు తిరిగి వచ్చిన ఇందిర స్వాతంత్ర్యోద్యమంలోకి దూకింది గాంధీజీ నేతృత్వంలో. యువతులతో ఒక **వానరసేన** ప్రారంభించి బ్రిటిష్ విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమించింది. లండన్‌లో ఉన్నప్పుడే ఈమె మంచి రాజకీయ పరిజ్ఞానం ఉన్న పార్శీ యువకుడు ఫిరోజ్ గాంధీని ప్రేమించింది. ఇద్దరూ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సభ్యులే ! ఒక విధంగా తండ్రిని ఎదిరించి ఇందిర "ఆదిధర్మ" సూత్రాలననుసరించి ఫిరోజ్‌ను మతాంతర వివాహం చేసుకున్నది. తన తర్వాత ప్రధాని ఐన రాజీవ్‌గాంధీకి, పెద్దకొడుకు సంజయ్‌గాంధీకి ఆమె జన్మనివ్వడం మీకు తెలిసిందే!

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా ఆమె తన సామర్థ్యం చాటుకున్నది. క్విట్ ఇండియా ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొన్నది. నెహ్రూ చెల్లెలు, ఆమె మేనత్త విజయలక్ష్మీ పండిట్ కూడా ఆమెకు ఒక స్ఫూర్తి. ప్రారంభదశలోనే ఆమె ఆత్మనిష్ఠ, రాజకీయనేపథ్యం చిత్రించే అంశాలివి.

బ్యాంకుల జాతీయాకరణ, బంగ్లాదేశ్ శరణార్థుల రక్షణ, పాకిస్థాన్‌తో యుద్ధం, చైనాకు అదురుపాటుగా జాతీయ అణ్వాయుధ విప్లవం, వ్యవసాయ ప్రధాన దేశమైన భారతంలో హరిత విప్లవం, పాడిపంటల అభివృద్ధి ప్రణాళికలు, రెండుసార్లు విధించిన అధ్యక్ష పరిపాలన, ఎన్నికల నేరారోపణలు ఎదుర్కొనడం, రూపాయి విలువ పడిపోవడం – ఇలా మంచీ చెడూ – వివరంగా చెప్పాలంటే మరెన్నో, ఇందిర పరిపాలన లోని ముఖ్య ఘట్టాలు. ఇన్ని నిత్య సంఘర్షణల మధ్య పరిశీలిస్తే వ్యక్తిగతంగా నిత్యకష్టజీవి తప్ప – ఇందిర సుఖశాంతులతో సుప్రశాంతంగా ఎన్నడూ లేదు. తాను

కరిగిపోతూ వెలుగులు పంచే కొవ్వొత్తి ఐనా, ఎదురెరుగని సమర్థ ప్రధాని – ఒక "ఆడపిడుగు" ఆమె! ఎంతో మనోధైర్యంతో అన్ని ప్రతికూల పరిస్థితులనూ అధిగమించిన మేధావిని. ఇందిరా ఈజ్ ఇండియా అన్న స్థాయికి ఎదిగి **భారతరత్న** పురస్కారం కైవసం చేసుకున్న నారీమణి.

చూశారా బాలలూ ! కేవలం వ్యక్తినిష్ఠ ప్రతిభతో, సామర్థ్యంతో భారత నారీమణులు ఎంత మహోజ్జ్వలంగా ప్రకాశించగలరో ! అందుకు ప్రత్యక్ష నిదర్శనం భారతరత్న శ్రీమతి ఇందిరా ప్రియదర్శినీ గాంధి.

